శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక-5

## శ్రీవైభవసారసంగ్రహః,
## శ్రీరామానుజగురు కృపా వైభవము,
## శ్రీరంగరాజస్తవంలో కవితాచాతురి,
## వేదంలో భగవదవతారాలు


**ఆంధ్రానువాదము:**

*పండితరత్న, ఉ.వే.శ్రీమాన్*

*ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు*

**సమర్పకులు:**

*ఈయుణ్ణి అనంత రంగ రామన్*



జూలై 10, 2021



ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారు
(అంతర్వేది పాలెం)





ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు
(పుత్తూరు అగ్రహారం, తిరుచ్చి)

# ముందుమాట

గడచిన శతాబ్దిలో భారతావనిలో భగవద్రామానుజ సిద్ధాంతాన్ని, సంప్రదాయాన్ని ప్రచారం చేసిన మహనీయులు ఎంతమందో ఉన్నారు. వీరంతా పలు విధాలుగా తమదైన శైలిలో సిద్ధాంత సంప్రదాయాల ప్రచారాన్ని, పరిరక్షణ చేశారు, కొంతమంది ఏకాంతంగా కాలం గడుపుతూ కాలక్షేపాలద్వారా ప్రచారాన్ని సాగించారు. మరికొంతమంది గ్రంథరచనల ద్వారా, ఉపన్యాసాల ద్వారా ప్రచారాన్ని చేశారు.

ఆంధ్రదేశంలో, ప్రత్యేకించి, ఉభయగోదావరీ మండలంలో గడచిన శతాబ్దిలో శ్రీ రామానుజ సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన మహానుభావులలో దాసుని పితామహులు, ఉభయ వేదాంత మహా విద్వాన్, ఉ. వే శ్రీమాన్ ఈయుణ్ణి శేష శింగరాచార్య స్వామి వారు అగ్రగణ్యులు. వీరు ప్రధానంగా నివృత్తి మార్గంలో తమ జీవితాన్ని సాగిస్తూ కాలక్షేపాల ద్వారా సంప్రదాయ ప్రచారాన్ని చేశారు. ఉభయ గోదావరీ మండల జ్ఞాన భాస్కరలుగా వీరు కీర్తింప బడ్డారు. శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామి వారు, కాంచీమహావిద్వాన్ అణ్ణంగరాచార్య స్వామి వారు మొదలైన మహనీయులు ఎంతమందో వీరిని గొప్ప పండితులుగా గుర్తించారు. వీరి దగ్గర పంచ సంస్కారాలను పొంది తరించినవారు చాలామంది ఉన్నారు. వీరు తమ జీవితాన్ని నివృత్తి మార్గంలో సాగించినందున వీరు గ్రంథ రచనను ఎక్కువగా చేయలేదు. కొన్ని వ్యాసాలను మాత్రమే అభిమానుల కోరికపై రచించారు. వాటిలో రెండు వ్యాసాలు ఈ గ్రంథంలో పాఠకులకు సమర్పింపబడుతున్నాయి



ఆ విధంగానే, తమిళనాడులో తిరుచ్చి ప్రాంతంలో గత శతాబ్ది ఉత్తర భాగంలో శ్రీ రామానుజ సిద్ధాంత సంప్రదాయ ప్రచారాన్ని చేసిన వారిలో శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి వారు ముఖ్యులు. వీరు **శ్రీ వైష్ణవ సుదర్శనమ్** అనే తమిళ మాసపత్రికను నిర్వహిస్తూ దానిద్వారా ఎన్నో అమూల్యమైన, అపూర్వమైన తమిళ గ్రంధాలకు, ద్రవిడ ప్రబంధ వ్యాఖ్యానాలకు ద్రావిడ భాషలో సులభమైన వివరణలను అందించారు. వీరి వలెనే వీరి తండ్రి గారు కూడా గొప్ప పండితులు. శ్రీ వైష్ణవసుదర్శనమ్. పత్రికను స్థాపించిన వారు వీరే. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు శ్రీ సుదర్శన పత్రికలో వెలువరించిన “వేదంలో భగవద వతారాలు”, “శ్రీరంగరాజస్తవంలో కవితా చాతురి” అనే వ్యాసాలను ఆంధ్రీకరించి ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది. ఇవి అన్ని సంప్రదాయ పాఠకులకు తృప్తిని, ఆనందాన్ని కలిగిస్తాయని నమ్ముతున్నాను. ఈ గ్రంధాన్ని సిద్ధం చేయడంలో సహకరించిన చిరంజీవి కుమారుడు శ్రీమాన్ అనంతరంగరామన్‌కు మంగళా శాసనాలు. స్వస్తి.

భవదీయుడు
ఈ ఏ శింగరాచార్యులు



సంప్రదాయ వ్యాసమాలా సేయం భక్త్యా సమర్పితా,
ఆస్తికానాం ముదే భూయాత్ సారాసార వివేకినామ్.

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీవైభవసారసంగ్రహః

ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారు
(అంతర్వేది పాలెం) అనుగ్రహించినది

శ్లో॥ **యద్భ్రూభఙ్గాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః ।
వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి యత్పాదచిహ్నై స్తరన్తి ॥
భోగోపోద్ఘాతకేళీచులకితభగవద్వైశ్వరూప్యానుభావా ।
సా న శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీలఙ్ఘనీయై రపాఙ్గైః ॥**

లోకములో ప్రతిమానవుడు **"నిరస్తాఖిలదుఃఖో౽ హ మనన్తానన్దభాక్ స్వరాట్ భవేయమ్"** అనగా – ఏ విధమైన క్లేశము లేక, సకలసంపదల నొంది స్వతన్త్రముగా జీవించవలెనని కోరుకొనుట సహజము. అట్టి ఇష్టప్రాప్త్యనిష్టపరిహారములకు శ్రీమహాలక్ష్మి కటాక్షమే ప్రధానమను లోకప్రసిద్ధమైన విషయమునకు సాక్షీభూతములై శాస్త్రములు వివరించుచున్నవి. అల్పజ్ఞులమైన, అశక్తులమైన మనమేకాక అతిశయితజ్ఞానశక్త్యాది గుణసంపన్నులైన, అణ్డాధిపతియైన బ్రహ్మాపర్యన్తముగల సకలదేవతల సమస్తేష్టానిష్టప్రాప్తినివృత్తులకు (కిం బహునా) సకలజగత్కారణభూతుడైన, సర్వరక్షకుడైన శ్రీమన్నారాయణుని సర్వప్రకారోత్కర్షకు, ప్రపన్నులకు పరమధనమైన దివ్యక్షేత్రముల ఉత్తరోత్తరాభివృద్ధికిని లక్ష్మీకటాక్షమే ప్రధానతమమని వేదములు. తదర్థవిశదీకర్తలైన మహర్షులు, భగవత్కటాక్షలబ్ధదివ్యజ్ఞానసంపన్నులైన శ్రీశఠకోపాది దివ్యసూరులు. వారి కటాక్షపాత్రులై, అతిశయితతత్త్వయాథాత్మ్యజ్ఞానవిదులైన నాథయామునాదులగు మన పూర్వాచార్యులును విశదీకరించియున్నారు. వేదములో శ్రీసూక్తము. **"అలక్ష్మీ ర్మే నశ్యతామ్"** అని సంగ్రహించి గ్రంథమును శాఖోపశాఖముగా వివరించుచున్నది. **"దారాః పుత్రా స్తథాగార – సుహృద్ధాన్యధనాధికమ్, భవేత్యేతన్మహాభాగే నిత్యం త్వద్వీక్షణా న్నృణామ్", "శరీరారోగ్య మైశ్వర్య మరిపక్షక్షయ స్సుఖమ్, దేవి త్వద్దృష్టిదృష్టానాం పురుషాణాం న దుర్లభమ్"** – అనగా దారాపుత్రాది కుటుంబాభివృద్ధికి, ధనధాన్యాది సకలసంపదలకు, అనిష్టనివృత్తికిని – శ్రీదేవీ కటాక్షమే ముఖ్యమని అన్వయరూపముగాను, **"సద్యో వైగుణ్య మాయాన్తి శీలాద్యా స్సకలా గుణాః, పరాఙ్ముఖీ జగద్ధాత్రి! యస్య త్వమ్"** అని వ్యతిరేకముఖముగాను – అనగా ఆమె ఉపేక్షయే



సకలానిష్టహేతువని మహర్షులు దృఢపరచిరి. **"వేరిమారాత పూమేలిరుప్పాళ్ వినై తీఙ్కుమ్", "తేనమరుమ్ పూమేల్ తిరు – నమకెన్డుమ్ శార్వు"** ఇత్యాదిగా దివ్యసూరులు పై అర్థమును దృఢపరచిరి. **"తేవిమారావార్ తిరుమకళ్…యేవ మత్తమరరాట్చెయ్ వార్", "తత్తదవసరోచితపరిచర్యాయా మాజ్ఞాపయన్త్యా"** ఇత్యాది దివ్యసూక్తులచే నిత్యసూరుల ఇష్టప్రాప్త్యనిష్టపరిహారములు మహాలక్ష్మీ కటాక్షాధీనమనిన ఇక సంసారుల విషయము చెప్పవలెనా?

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **"నిత్యర్క్కుమ్, ముక్తర్క్కుమ్ విరోధి కైంకర్యహాని, అపేక్షితమ్ కైంకర్యవృద్ధి"** అని నిత్యముక్తుల ఇష్టానిష్టములను స్పష్టపరచియున్నారు. **"శ్రేయో న హ్యరవిన్దలోచనమనఃకాంతాప్రసాదాదృతే సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్", "ఐశ్వర్య మక్షరగతిం పరమపదం వా కస్మైచిదఞ్జలిభరం వహతే వితీర్య"**, అని సాయించిన అర్థమును రహస్యగ్రంథములో **"ద్వయత్తిల్ పెరియపిరాట్టియాలే పేటెన్గిఅదు, అదావదు–ఇవళ్ పురుషకారమానాలల్లదు ఈశ్వరన్ కార్యమ్ శెయ్యానెన్గై"** అని సంగ్రహించిన అర్థమును ఆచార్యవర్యులు శ్రీ వచనభూషణ దివ్యశాస్త్రములో వివరించియున్నారు. **"వేదవేద్యే పరే పుంసి"** ఇత్యాదిగా వేదప్రాదుర్భావమని శ్లాఘించబడుచున్న శ్రీరామాయణము మహాలక్ష్మీ వైభవమని ఆచార్యసమ్మతము. శ్రీవాల్మీకిభగవానులే **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్"** అని స్వసిద్ధాంతమును స్పష్టపరచిరి. **"రఘువరచరితం రామాయణమ్"** అని పేరుపెట్టియున్నను, **"మహత్ చరితమ్"** అనునది వాక్యార్థము. అనగా – ఇందులో ముఖ్యతాత్పర్యముగా ప్రతిపాదింపబడు విషయము సీతాప్రభావమేయనునది మహర్షి యభిప్రాయమని తేలినది. శరణాగతవత్సలుడని, **"రిపూణా మపి వత్సలు"** డని, **"పితేవ పరితుష్యతి", "నిత్యం ప్రసన్నాత్మా", "కరుణాకాకుత్థ్సుడ"** ని ప్రసిద్ధి పొంది కరుణామూర్తియైన శ్రీరామచన్ద్రుల యవతారకాలములో జరిగిన యాశ్రితరక్షణము సర్వత్ర లక్ష్మీకటాక్షపాత్రులకే యని మన పూర్వాచార్యులు సిద్ధాన్తము చేసియున్నారు. అది లేనివారికి అపాయమే తటస్థించినట్లు చరిత్ర స్పష్టముచేయుచున్నది. ఇందువలన శ్రీరామాయణము సర్వము సీతాప్రభావప్రతిపాదకమని పూర్వాచార్యుల యభిప్రాయము, అశక్తులమై, అల్పజ్ఞులమైన అస్మదాదులకే కాక విలక్షణజ్ఞానశక్తిసంపన్నులైన బ్రహ్మాదిదేవతల ఇష్టానిష్ట ప్రాప్తిపరిహారములు లక్ష్మీకటాక్షాధీనములని స్పష్టమగుచున్నది. **"తతో౽ వలోకితా దేవాః"** ఇత్యాది. **"త్వయా దేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్ త్వయేదానీం సమేధితమ్"** అని దేవతలు స్తుతించియున్నారు. అనగా – లక్ష్మీకటాక్షముచే యభివృద్ధి పొందినామని, ఉపేక్షానమయములో వినష్టప్రాయులమైతిమి యని అర్థము. **"పరిత్యక్తమ్"** – అనగా ఉపేక్షాకాలమని

అర్థము. నిగ్రహకాలమని కాదు. **"అనుగ్రహమయీం దేవీం నిత్య మజ్ఞాతనిగ్రహా"** మని యున్నదికదా? **"ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ"** యనిరి మహర్షి కూడ. **"బ్రహ్మాద్యా శ్చ సురా స్సర్వే మునయ శ్చ తపోధనాః, ఏధన్తే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి"** యని కాశ్యపబ్రహ్మర్షి స్తోత్రము చేసియున్నారు. కావు బ్రహ్మాద్యైశ్వర్యమును లక్ష్మీకటాక్షాధీనమని స్పష్టమగుచున్నది. **"యస్యాః క్షటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశాః"**, **"లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం యస్యాః ప్రసాదపరిణామమ్"**–**"యస్యాః కటాక్ష మనుక్షణ మీశ్వరాణా మైశ్వర్యహేతు"** రిత్యాద్యాచార్యవర్యదివ్యసూక్తులు పై ఆర్ష ప్రమాణార్థ వివరణములే, భట్టరువారు **"ఇదం సదసదాత్మానా నిఖిల మేవ నిమ్నోన్నతం కటాక్షతదుపేక్షయో స్తవ హి లక్ష్మి తత్తాణ్డవమ్"**, **"అపాఙ్గా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్, అమీ యత్ర ద్విత్రా స్స చ శతమఖాదిః"** యని సాయించియున్నారు. అనగా, సర్వజ్ఞులు, అల్పజ్ఞులు, బలవంతులు, బలహీనులు, ధనికులు, దరిద్రులు – ఇత్యాది నీచోచ్చస్థితికి కారణము లక్ష్మీకటాక్షతారతమ్యమే యని అర్థము. **"అపాంగా భావ భూయాంసః"** ఇత్యాది శ్లోకమునకు. లక్ష్మీకటాక్షవీక్షణ ప్రసరణముచే ఇంద్రాదులకు త్రిలోకైశ్వర్యము కలిగినదనియు, ఆమె పరిపూర్ణపూర్ణకటాక్ష ప్రసరమువలన పరబ్రహ్మకు సర్వప్రకారోత్కర్ష కలిగినదనియు భావము. భట్టర్ మరియొకచోట, **"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే మంగళపదం తవేదం నోపాధేః"** అని పై శ్లోకభావమును వివరించిరి. ఇందువలన భగవంతుని అతిశయము లక్ష్మీసంబన్ధాధీనమని స్పష్టబడినది. వేదములో **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** **"శ్రద్ధా లక్ష్మీ, మేధా శ్రద్ధా సరస్వతీ, అహం శ్రద్ధాం చ మేధాం చ"** ఇత్యాది స్వవాక్యములచే లక్ష్మీయని అర్థము. ఆమె సంబన్ధముచే భగవంతునకు ఈశ్వరత్వము ప్రాప్తమైనదని స్పష్టముగా చెప్పబడినది.

సర్వచేతనాచేతనోత్కర్ష లక్ష్మీకటాక్షాధీనమైనచో వేదములో సర్వత్ర లక్ష్మీవైభవమునేకదా ప్రధానముగా చెప్పవలెను. **"సర్వే వేదా యత్పద మామనన్తి వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"**–అని వేదములోను, భగవద్గీతలోను, వేదమంతయు భగవద్వైభవమునే చెప్పునట్లున్నదే? ఈ భట్టర్‌నాథులును **"శ్రీశ్రీసూక్తం బహుముఖయతే"** యని శ్రీసూక్తము మాత్రము లక్ష్మీవైభవమును వివరించునట్లు సాయించిరిగదా? దీనికేమి కారణమని ఒక శంక తోచుచున్నది, ఈ శంకను భట్టరువారు **"దేవి శ్రుతిం భగవతీమ్", – "అపాంగా భూయాంసః"** ఇత్యాది శ్లోకములచే పరిహరించియున్నారు. అనగా – ఓ దేవి! వేదమును గుణరత్నకోశగృహమని వ్యవహరించుచున్నారు. ధనాగారములో దాచియుంచిన రత్నములు బయటకు గోచరింపవు. కవాటమును బంధించి రహస్యముగా నుంచుదురు. ఇచట వేదమను గుణరత్నకోశముయొక్క కవాటబంధమును తెరచు ఉపకరణములు న్యాయసహితమైన



ఇతిహాసపురాణాదులు. వాటివలననే నీ గుణములు ప్రకాశింపచేయబడుచున్నవి. శ్రీరామాయణము సీతాచరితమని స్పష్టమేకదా! ఆ శ్రీరామాయణము **"వేదవేద్యే"** ఇత్యాదిగా వేదప్రాదుర్భావమనుట సర్వసమ్మతము. వేదవివరణమైన శ్రీరామాయణము సీతాప్రభావపరమనిన, దీనికి మూలమైన వేదముకూడ లక్ష్మీప్రభావమునే బోధించుచున్నదని అంగీకరించవలెను. మరియు **"వేదేషు పౌరుషం సూక్త"**మని సకలవేదసారమైనదనియు, సర్వశాఖలయందు పఠింపబడుచున్నదనియు, పురుషసూక్తమును అంగీకరించియున్నారు. ఆ పురుషసూక్తములో **"పురుష ఏవేదగ్ం సర్వమ్''** ఇత్యాదిగా పరమపురుషుని నిరంకుశైశ్వర్యమును చెప్పి, తదుత్తరానువాకమయిన **"అద్భ్యః స్సంభూతః"** అని ప్రారంభించిన అనువాకములో **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** అని శ్రియఃపతిత్వమే ఈ మహత్వమునకు కారణమని సూచించినది. మరియొకవిధముగాకూడ వేదము లక్ష్మీప్రభావమునే బోధించుచున్నదని ఆచార్యుల అభిప్రాయము. **"తదుభయ ముశం స్త్వాం ప్రణిజగౌ"** – అనగా – వేదపూర్వభాగము ఇంద్రాద్యైశ్వర్యమును బోధించుచున్నది. ఉత్తరభాగము భగవదైశ్వర్యమును వివరించుచున్నది. రాజరామణీయకమును, కోశాగారాదిమహదైశ్వర్యమును వర్ణించినచో, అది ప్రభువుయొక్క అతిశయములో పర్యవసించునట్లు, ఇవి లక్ష్మీప్రభావములోనే సంబంధించునని, లక్ష్మీదేవిని ప్రభుస్థానములోను, సర్వేశ్వరుని రాజధాని స్థానములోను, ఇంద్రాదులను ధనాగార స్థానములోను చేర్చి సకలవేదములు లక్ష్మీప్రభావ బోధకములేయని సమర్థించి పూర్వాచార్యులు భగవానుని ఉత్కర్ష లక్ష్మీసంబన్ధాధీనమని తెల్పిరి. ఇట్లు అంగీకరించిన సర్వవేదాన్తవాక్యవిరోధముకదా? యని వేఱొక శంక కలుగుచున్నది. **"స్వే మహిమ్ని ప్రతిష్ఠితః", "న తత్సమ శ్చ", "యస్మా త్పరమ్", "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్, "క్షరాత్మానౌ", "ఏక ఇంద్రజా జగతో బభూవ, శాస్తా చరాచరస్యైకః, ఏక శ్శాస్తా న ద్వితీయోఽస్తి", "శాస్తా విష్ణు రశేషస్య"** ఇత్యాదిగాగల పరస్సహస్రప్రమాణములు సర్వేశ్వరుడు, స్వాభావికానవధికాతిశయైశ్వర్యము కలవాడని తెలుపుచున్నవి. కావున సర్వప్రమాణప్రకోపము కలుగుచున్నదియని వేఱొక శంక కల్గును. దీనికి సమాధానమును **"స్వరూపం స్వాతన్త్ర్యమ్"** ఇత్యాదిగా పరిహరించి, దృష్టాంతముచేతకూడా భట్టర్ పరిహరించియున్నారు. శ్రీగుణరత్నకోశములోని **"స్వతః శ్రీ స్త్వం విష్ణో స్స్వ మసీ"** ఇత్యాది 28వ శ్లోకములో, **"స్వరూపం స్వాతన్త్ర్య"** మిత్యాది శ్లోకములో దీనిని ఇట్లు వివరించిరి. హేచంద్రవదనే? దేవి? భగవంతుని స్వాతన్త్ర్య స్వరూపమును శాస్త్రములచే నిష్కర్షించి నిరూపించినట్లైన నీ నిత్యసంబంధముచేతనే అది సిద్ధించుచున్నది. ఇదియే శాస్త్రనిష్కర్షము – అని వీని భావము. భగవానుని స్వాభావికమైన స్వాతన్త్ర్యమును లక్ష్మీసంబన్ధాధీనమనిన విరోధముకదా? యనిన –

**“క మితుః, త్వమి, ఇదమిత్థంత్వవిభవః, ఇదం విభవః ఇత్థంత్వవిభవ శ్చ అసి”** – అనగా – వీడు ఈశ్వరుడు – అని విశేష్యనిర్దేశము చేయునపుడు శ్రియఃపతియని చెప్పవలెను. లక్ష్మీసంబన్ధమును చూచియే ఈశ్వరుడని నిర్ణయించవలెను. ఇట్లే, సర్వేశునకు లక్షణమేమి? యనిన శ్రియఃపతిత్వమని చెప్పవలెను. **“అహంతా బ్రహ్మణ స్తస్య సాహ మస్మి సనాతనీ”** అని మహాలక్ష్మివచనము. ఇందువలన భగవంతునకు, సత్యత్వ జ్ఞానత్వానన్దత్వాది, స్వరూపనిరూపకధర్మములలో, శ్రియఃపతిత్వము ముఖ్యధర్మము. స్వరూపనిరూపక ధర్మముగదా, వస్తువునకు, ఇతరపదార్థమునకున్న భేదమును తెలియజేయు ధర్మము. శ్రియఃపతియనిన అది యితరులకు యెవరికిని సంబంధించదు. అట్టి స్వరూపనిరూపక ధర్మము వస్తుస్వరూపమును విశదము చేయును. అందువలన కలిగిన అతిశయము స్వాభావికోత్కర్షకు బాధకముకాదు. మహాలక్ష్మీసంబన్ధప్రయుక్తమైన అతిశయము భగవంతుని అధిక్యములోనే పర్యవసించుటచేత వేదములలో వేరుగా లక్ష్మీవైభవము చెప్పబడుటలేదని ఈశ్లోకార్థము. **“స్వత శ్రీ స్త్వం విష్ణో స్త్వమసీ”**త్యాదిశ్లోకమున – మహాలక్ష్మీకటాక్షాధీనవైభవము కలవాడు సర్వేశ్వరుడని చెప్పబడినది. అట్లయిన, భగవద్వైభవము నిరుపాధికమను (స్వతసిద్ధమని) బోధించు శాస్త్రవిరోధము కలుగుచున్నదే? యనిన దానికి సమాధానము ఇట్లు సాయించబడుచున్నది. రత్నమునకు కాన్తిచేత అతిశయము కలుగుచున్నది. ఇందువలన రత్నముయొక్క ప్రాధాన్యమునకు తక్కువ వచ్చినదా? రత్నమునకు స్వతస్సిద్ధధర్మము కాంతి. ఆగంతుకమైన గుణము కాదు. విద్వాంసునకు పాండిత్యముచే అతిశయము. రత్నమునకు కాంతి అట్టిదికాదు, నిత్యధర్మము. అట్లనే, ఓ దేవి! **“స్వతః విష్ణో స్స్వ మసి”** స్వతః సర్వేశ్వరునికి నీవు శేషము. **“స్వత్వ మాత్మని సంజాతం, స్వామిత్వం బ్రహ్మణి”**–సమస్తాత్మలు భగవంతునికి శేషములు కనుక, నీవు జీవకోటిలో చేరితివి. కనుక, నీవు పరమాత్మకు శేషభూతురాలవు. కనుక నీ మూలముగా కలిగిన అతిశయము. భగవంతుని స్వాభావికోత్కర్షమునకు భంజకము కాదని ఈ శ్లోక తాత్పర్యము. వేదములో, **“ఆనీదవాతంగ్గ్ స్వధయా తదేకమ్”** అనే వాక్యము పఠించబడుచున్నది, **“స్వధయా, లక్ష్మా–ఆనీత్, అని – ప్రాణనే** –అని ఇచటి ధాతువు అర్థము. పరబ్రహ్మ లక్ష్మీసంబన్ధముచే సత్తను పొందియున్నాడని – లక్ష్మీసంబన్ధాధీనసత్తకలవాడని పర్యవసించినది. అట్లయిన భగవానుడు నిరుపాధికోత్కర్ష కలవాడని ఎట్లు చెప్పవచ్చును? అని వేఱొక శంకాతాత్పర్యము. **“కృత్వా మత్స్థాని భూతాని చరాణి స్థావరాణి చ, ఏకాకీ విద్యయా సార్థం విహరిష్యే ద్విజోత్తమ”** అనే ప్రమాణానుసారము పై వేదవాక్యమునకు ప్రళయసమయములో మహాలక్ష్మితోకూడ చేరి లీలారసమును అనుభవించుచుండుననియు, తిరిగి సృష్టికాలము రాగానే ఆమె అంగీకారమును, ముఖవికాసమును అనుసరించి



సృష్టికార్యమును నిర్వహింతుననియు అర్థము. మహాలక్ష్మిని విడిచి క్షణకాలముకూడ విశ్లేషమును సహించజాలని భగవానుని ప్రేమపారవశ్యము దీనిచే సూచించబడినది. **“తేనేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి”, “న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్”** అని శ్రీరామచన్ద్రవాక్యము, **“కృత్వా మత్స్థానీత్యాది”** ప్రమాణార్థమును భట్టర్ శ్రీరంగరాజస్తవములో, 44–వ శ్లోకమున **“ప్రళయసమయసుప్తం స్వం శరీరైకదేశమ్”** ఇత్యాదిగా వివరించియున్నారు. చేతనాచేతన శరీరకుడైన సర్వేశ్వరుడు, పురుషనెమలి తన శరీరములో ముడుచుకునియున్న పింఛమును, స్త్రీ నెమలి ప్రీతికై విప్పి ఆడినట్లు, సృష్టికాలము రాగానే తన శరీరములో ఏకదేశమై, లీనమైయున్న చేతనాచేతనములను విస్తరింపచేసి, **“బహుస్యామ్”** అని సృష్టిచేయుచున్నాడని ఈ శ్లోకతాత్పర్యము. ఈ అర్థమును **“అంగీకారిభి రాలోకైః”**, అనియు, **“యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్”** ఇత్యాదిగా ఆచార్యులు విశదీకరించియున్నారు. భగవంతుడు మహాలక్ష్మియందు ఇంతటి వాత్సల్యము కలవాడు గనుకనే, సర్వేశ్వరుని ఆశ్రయించు సంసారిచేతనులు మహాలక్ష్మీపురుషకారపూర్వకముగా నాశ్రయించవలెనని శాస్త్రములు బోధించుచున్నవి. మనచే చేయబడిన అనాది ప్రబలదుష్కర్మలను చూచి, **“క్షిపామి – న క్షమామి”** అనే రీతిగా తన నిరంకుశస్వాతన్త్ర్యముచే నిగ్రహించక, అపరాధములను క్షమించి, రక్షించుటకు మహాలక్ష్మి పురుషకారమత్యావశ్యకమని. ఆచార్యవర్యులు రహస్యగ్రంథములో విస్తరించి సాయించియున్నారు. అందులో సారమైన ఒక ఆచార్యసూక్తి. **“ఇవళ్ తాయాయ్, ఇవర్కళ్ క్లేశమ్ పొరుక్కమాట్టాదే, అవనుక్కు వల్లియాయ్, ఇనియ విషయమాయిరుక్కైయాలే, కణ్ణళ్ళివత్త పురుషకారమ్”** అని – మహాలక్ష్మి అఖిలజగన్మాత గనుక మన మనుభవించు దుష్కర్మఫలమయిన దుః ఖములనుచూచి సహింపజాలక, సర్వేశ్వరుని స్వాతన్త్ర్యము తల యెత్తకుండునటుల తన పురుషకారచాతుర్యముచేతను, తన సౌన్దర్యాద్యావిష్కరణచేతను అతనిని వశపరచుకుని, జీవుని క్షమింపచేసి రక్షింపచేయగల అమోఘమయిన పురుషకారమని ఈ వాక్యతాత్పర్యము. **“పితేవ త్వత్ప్రేయాన్”** ఇత్యాది శ్రీపరాశరభట్టార్యులు శ్రీగుణరత్నకోశములోని 52వ శ్లోకము ఈ చూర్ణికార్థమునే వివరించుచున్నది. దీని విస్తరము పూర్వాచార్య రహస్యగ్రంథములో అనుభవించవలెను. ఇంతవరకు సకలచేతనేశ్వరుల సమృద్ధి మహాలక్ష్మీకటాక్షాధీనమని స్పష్టమయినది. **“అడియోముక్కే ఎమ్బెరుమానల్లీరో నీర్”** అనియు, **“పడియే పరవిత్తొళ్లున్దమ్ తొణ్డర్ తమక్కడియే”** ఇత్యాది దివ్యసూరి సూక్తిరీతిగా ప్రపన్నులకు పరమధనమైయున్న దివ్యక్షేత్రముల సకలసంపత్తు శ్రీమహాలక్ష్మీకటాక్షాధీనమని పరాంకుశపరకాలాది దివ్యసూరిదివ్యప్రబంధములవలన స్పష్టమగుచున్నది. దివ్యప్రబంధములలో **“శెల్వమ్**

**మల్కు కుడి తిరువిణ్ణకర్," "శెల్వమ్ మల్కు యవన్కిడైన్ద తిరుక్కోళూర్, "శెల్వమ్ మల్గు తెన్ తిరుక్కుడన్దై"** – ఇత్యాదిగా దివ్యక్షేత్రముల సంపత్సమృద్ధిసాయించబడినది. ఇచట సాధారణముగా సంపత్తు అనుటచే సర్వవిధసంపత్సమృద్ధియని అర్థము. భగవద్గుణసమృద్ధి, ఆశ్రితసర్వప్రకారరక్షణసమృద్ధి, భక్తానుభావ్యమయిన సర్వదేశకాలావస్థోచిత కైంకర్యసమృద్ధికూడ ఇచట వివక్షితములు. ఈ సర్వమునకు మహాలక్ష్మీకటాక్షమే ప్రధానకారణమని స్పష్టమగుచున్నది. **"ఇన్బమ్పయక్క వినిదుడన్ వీత్తిరున్దాళ్కిన్ఱు"** ఇత్యాది పరమపదానుభవముకన్న అధికముగా పరిపూర్ణానుభవమును భక్తుల కనుగ్రహించుటకై పిరాట్టి సహయోగముతో భగవానుడు సాన్నిధ్యముచేసియుండునవి దివ్యదేశములని వీని భావము. ఇచట తిరువారన్విళైయన్నది ఉపలక్షణము. కనుకనే ఆళ్వార్ **"తెళివిశుమ్బైఱలుత్తాల్. తిరువాఱన్ విళైయదనై, మేవి వలమ్ శెయ్దు.....యెన్ను మెన్ శిన్దనై"** అని సాయించిరిగదా? పరమపదమును పొందునటుల నాకు అనుగ్రహించినను నా మనస్సు తిరువాఱన్విళై కైంకర్యమునే ఆశించుచున్నదని ఈ సూక్తి భావము. **"తిరుమాలిరుఞ్జోలైమలై యెన్ఱే నిన్న, తిరుమాల్ వన్దు"** ఇత్యాది అల్పవ్యాజముచే సర్వప్రకారరక్షణము చేయువాడనియు యర్థము. అర్చావతారములోగల గుణసమృద్ధి పఞ్చప్రకారములలో అర్చారూపిలో పూర్ణము **"పూర్ణ మెన్నైయాలే యెల్లా గుణఙ్గళ్ పుష్కలఙ్గళ్''** ఇత్యాదిగా పిళ్ళైలోకాచార్యులువారు సాయించియున్నారు. శ్రీవచనభూషణాది దివ్యశాస్త్రములలో పైపాశురములలో పిరాట్టిసహయోగమును సాయించుటచే ఈ భగవానుని సమృద్ధులకంతయు లక్ష్మీనిత్యసాన్నిధ్యమే కారణమని సూచించబడినది. ఈ విధముగా **"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యామ్ ప్రతిష్ఠితమ్"** అనురీతిలో, **"న జీవేయం క్షణ మపి"** యనునట్లు సర్వేశ్వరుడు, **"అకలకిల్లే నిత్తైయుమ్"** అని పిరాట్టియు పరస్పరవాల్లభ్యము కలిగి, ఆశ్రితవాత్సల్యముచే **"కి మేత న్నిర్దోషః, కః"** అనియు, **"ఎన్నడియారదు శెయ్యార్"** అనియు ఇరువురు ఐకరస్యముతో ఆశ్రితరక్షణకై నిత్యసాన్నిధ్యము చేసియున్నారు. దూరము పోజాలని అస్మదాదులకు, నిత్యోత్సవ, పక్షోత్సవాది వైభవములను అనుభవింపచేయుచు రక్షించుచున్న దివ్యక్షేత్రమగు ఈ శ్రీరంగక్షేత్రములో యథాశక్తి తను, ధన, మనో, వాగ్రూపములుగా కైంకర్యములో అన్వయించి, స్వరూపసిద్ధిని పొంది, భక్తులందరు దివ్యదంపతుల కటాక్షమునకు పాత్రులై, ఐహికాముష్మిక సకలసంపదల నొందుదురుగాక – అని విన్నవించి, విస్తరభయముచే సంగ్రహించి వ్యాసము సమాప్తి చేయబడినది.

**"సర్వే జనా స్సుఖినో భవన్తు"**



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీరామానుజగురు కృపా వైభవము

ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారు
అనుగ్రహించినది

**శ్రీమా నేష చిరంతనశ్రుతివధూసీమంతనైపథ్యకృత్-**
**మాయావాదమహాంధకారదళనబ్రధ్నాయమానోదయః ।**
**విద్యాంబోధిసధర్మిణీజనిగిరిః హృద్యాపదానావళిః**
**శ్రీరామానుజయోగిరా డ్విజయతే ధీరాగ్రణీసంస్తుతః ॥**
(మహావిద్వాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామివారు)

**లక్ష్మీనాథాఖ్యసింధౌ శఠరిపుజలదః ప్రాప్య కారుణ్యనీరం**
**నాథాద్రా వభ్యషించ త్తదను రఘువరాంభోజచక్షుర్ఝరాభ్యామ్ ।**
**గత్వా తాం యామునాఖ్యాం సరిత మథ యతీంద్రాఖ్యపద్మాకరేంద్రం**
**సంపూర్య ప్రాణిసస్యే ప్రవహతి సతతం దేశికేంద్రభ్రమౌఘైః ॥**

శ్రియఃపతియైన సర్వేశ్వరునకుగల చేతనవిషయమైన సహజసౌహార్దము, చేతనులు చేయు అకృత్యకరణాది శాస్త్రమర్యాదోల్లంఘనాతి ప్రవృత్తులచే కలుషితమై, శాస్త్రానుగుణముగా ఫలప్రదానమును చేయవలెనను సంకల్పమునుగల నిరంకుశ స్వాతంత్ర్యము క్రింద అణగియుండుటచేత, కృపాఫలమగు చేతనరక్షణకార్యము ఫలింపకపోయెను. శ్రీమహాలక్ష్మి తనకు జీవులతోగల మాతృత్వసంబంధము చేతను, కారుణ్యస్వరూపిణి కావునను, **"నిత్య మజ్ఞాతనిగ్రహా"** మని పొగడబడునది కావునను, సంసారిచేతనులు పడు దుఃఖపరంపరలను చూచి సహింపలేక, సర్వేశ్వరుని చూచి **"కి మేతత్? నిర్దోషః కః?", "న కశ్చి న్నాపరాధ్యతి"** – ఇది ఏమి? కృపాసముద్రుడవగు నీవు సంసారులను ఇట్లు దుఃఖింపజేయుట నీ కృపాగుణమునకు విరుద్ధము కదా! తప్పుచేయని వాడు ఈ సంసారములో నుండునా?" – అనుచు, ఉచితములైన ఉపాయములతో అణగియున్న స్వామి కృపను ఉద్వేలముగా వృద్ధి పొందించును. అందువలన సర్వేశ్వరునకు సకల సంసారిచేతన సంరక్షణ సంకల్పము కలుగును. అపుడు అతడు ఏకాంతమున – **"పాఱ్కడల్ పైయిత్తుయిన్ఱ పరమన్"** – పాలసముద్రమునందు అవహితచిత్తుడై పవళించిన పరమోదారుడని గోదాదేవి,

**"ఉఱఙ్గువాన్పోల్ యోగుశెయ్ద పెరుమాన్"** - నిద్రావ్యాజముతో జగద్రక్షణ చింతనచేయుచున్న సర్వస్వామి అని నమ్మాళ్వార్లును వచించిన ప్రకారముగా, చింతించుచుండగా, కర్షకులైన సంసారులు నదీప్రాంతములలో కాక, వర్షాధార ప్రదేశములలో కృషికి తగిన సదుపాయములను కల్పించుకొని, సస్యఫలప్రాప్తిని పొందునటులనే, భగవానుడును భక్తికర్షకుడు కావున అట్టి ఉపాయమునే ప్రాణిసస్య ప్రాప్తికొఱకు ఉపయోగింపవలెనని సంకల్పించుకొనెను.

తిరుప్పావై దివ్యప్రబంధములో **"ఆళ్రియుళ్ పుక్కు ముకన్దుకొడు ఆర్త్తేరి"** ఇత్యాదిగా **"వాళ్రవులకినిల్ పెయ్దిడాయ్"** - నదీతటాకాదులు నిండునట్లు వర్షింపవలెననుచు శ్రీగోపికలు పర్జన్యదేవుని ప్రార్థించిన దానికి తగినట్లు, వర్షాకాలములో పర్వతములందు మేఘములు వర్షింపగా ఆ జలము సెలయేళ్ళద్వారా మహానదులలోనికి చేరినపుడు, ఆ నదులు ఉద్వేలముగా ప్రవహించును. అపుడు ఆ నదులలోని నీరు కాలువలద్వారా ధర్మప్రభువులచే నిర్మింపబడిన పెద్ద పెద్ద తటాకములలోనికి చేరి, వానిని నిండించును. ఇట్లు తటాకములలో చేరిన నీటిని నిమ్నోన్నతప్రదేశానుగుణముగా అమర్చబడిన తూములద్వారా అపేక్షితసమయములలో సస్యక్షేత్రములలోనికి ప్రవహింపజేసి, కర్షకులు సస్యఫల ప్రాప్తిని పొందుదురు - అను ఈ విషయము లోకానుభవప్రసిద్ధమే కదా! ఈ విధముగానే **"ఒగ్రగ్రిక్కుళ్రియుమ్ నాఞ్జిలు మెరుపాల్ తోన్ఱ త్తాన్ తోన్ఱి"** అనునట్లు బలరామావతారములో కర్షకలాంఛనమైన నాగలిని భుజముపై దాల్చి సంచరించిన మహాత్ముడనుచు తిరుమజ్జైయాళ్వార్ ఆనతిచ్చిన రీతిలో సర్వేశ్వరుడు హలధారియైన భక్తికర్షకుడు. కావున అతనికి కర్షకవ్యాపారమే రుచించినది. ప్రాణిసస్య కృషిచేయవలెనను సంకల్పము కల్గినది. అహంకార మమకారములచేతను, లౌకికవిషయప్రావణ్యాదుల చేతను **"అవజానంతి మాం మూఢాః"** అనునట్లు మానవ మాత్రుడనేనని నన్ను అలక్ష్యము చేయుచున్నారను గీతాచార్యవచన ప్రకారమున, **"యాదానుమ్ పగ్రగ్రి నీఙ్గుమ్ విరతత్తై"** - ఏదోవిధముగా స్వామిని విడచి దూరము కావలెనను వ్రతమును పూనియున్నారని నమ్మాళ్వార్లు సాయించిన రీతిలో సంసారులు తన పరమకృపారసప్రవాహమునకు దూరస్థులైయుండుటచే, వారిపై తన కృపారసమును ప్రవహింపజేయవలెనని భగవానుడు సంకల్పించి, ఒకానొక సంసారివలె తన ఆత్మ అగు శ్రీశఠకోపమునీంద్రులపై తన నిర్హేతుక దివ్యకటాక్షమును ప్రసరింపజేసెను. దానివలన దివ్యజ్ఞానసంపన్నులైన శఠకోపమునీంద్రులనెడి దివ్యమేఘము సర్వేశ్వరుని సంకల్పమును గ్రహించి, వాని పరమకృప అనెడి సముద్రములో ప్రవేశించి, సర్వత్ర ప్రవహింపజేయతగిన ఆ స్వామి కృపారసమును **"శీర్క్కడలైయుళ్ పొదిన్ద శిన్దనైయేన్"** (భగవానుని కల్యాణగుణములనెడి సముద్రమును లోపల ఇముడ్చుకొనియున్న మనస్సును కలవాడను) అను దివ్యసూక్తి ప్రకారము అనుభవించి, నాథమునులనెడి



ప్రథమాచార్యులగు ఉన్నత పర్వతముపై వర్షించినది. ఆ జలము శ్రీపుండరీకాక్షులు, శ్రీరామమిశ్రులు - అను రెండు కొండవాగుల ద్వారా శ్రీయామునులనెడి మహానదిలోనికి చేరి, అందుండి పంచాచార్యులను కాలువలద్వారా భగవద్రామానుజులనెడి అనవధికవైశాల్యమును కల అద్వితీయతటాకములో చేరినది. ఇది లౌకికతటాకమువలె అచేతనము కాకుండ, సర్వజ్ఞాననిధియైన తటాకము కావున, సర్వేశ్వరుని సంకల్పానుసారము సమకాలవర్తులైన ప్రాణులనెడి సస్యములను, అనంతకాలములో జన్మించు అస్మదాదులను తరింపజేయ సన్మార్గములను స్వయముగా కల్పించి, సర్వేశ్వరుడను కర్షకునకు చేతనసస్యలాభమును కల్గించుటద్వారా అతనిని పూర్ణమనోరథుని గావించుచున్నది.

సమకాలములో (తాము జీవించియున్నకాలములో) కూడ **"శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ, శ్రీకూర్మం పురుషోత్తమం చ బదరీనారాయణం నైమిశమ్, శ్రీమద్ద్వారవతీ ప్రయాగమథురాఽయోధ్యాగయా పుష్కరమ్, సాలగ్రామగిరిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః"** అనే భట్టనాథసూక్తి ప్రకారమున, **"తీర్త్తకరరామిన్ తిరిన్దు"** (అంతట సంచరించి, లోకమును పావనము చేయుడు) అని శ్రీసరోయోగివరులు నుడివిన ప్రకారమున అంతట సంచరించుచు, తమ దివ్యకటాక్షముద్వారా, పరమత దోషోద్ఘాటన పూర్వకముగా ఆ మతములను నిరసించి, సిద్ధాంతస్థాపనమును చేయుటద్వారా, అచటి ప్రభువులు తమ అప్రతిమప్రభావమును చూచి తమను ఆశ్రయించురీతిలో వెలుగొందిరి. మఱియు, **"తత స్వచరణాంభోజస్పర్శసంపన్నసౌరభైః, పావనై రర్థిన స్తీర్థై ర్భావయంతమ్"** అను రీతిలో తమ శ్రీపాదతీర్థమును అనుగ్రహించుటద్వారా సమకాలీనులనుకూడ తమ కృపకు పాత్రులను గావించిరి.

శ్రీశఠకోపయోగివర్యులు తమ దివ్యదృష్టితో శ్రీరామానుజార్య సార్వభౌమావతార కాలమునందలి శ్రీవైష్ణవ సమృద్ధిని కటాక్షించి, **"పొలిక పొలిక పొలిక"**, **"కలియుమ్ కెడుమ్ కణ్డు కొణ్మిన్"**, **"మలియప్పుకున్దిశైపాడి ఆడి యుళ్రితరక్కణ్డోమ్"**, **"అశురర్ అరక్కర్ పిఱన్దీరుళ్ళీరేల్ వుయ్యుమ్ వకై యిల్లై"** (ఇక కలియుగ దోషము నశించినది. సర్వత్ర నిరవకాశముగా పరమభాగవతసంఘమును, **"ఏత త్సామ గాయ న్నాస్తే"** అను ముక్తగానముతో సమానముగా ఈ విభూతిలో భగవద్గుణానుభవవివశులైన ఆ భక్తశిఖామణుల భగవద్గుణ కీర్తనధ్వనిని, వారి సంచారములను చూచుచున్నాము. ఇక, అసురరాక్షసాదులకు ఆ భాగవతులను ఆశ్రయించుట తప్ప వేఱువిధముగా జీవించుటకు అవకాశములేదు. ఈ సమృద్ధి నిత్యము వృద్ధిని పొందుగాక) - అనుచు మంగళాశాసనమును చేసినటుల శ్రీవైష్ణవసిద్ధాంతమును శ్రీరామానుజులు సర్వత్ర సుస్థాపన చేసిరి. **"ఏకాంతిభిః**

**ద్వాదశభిః సహస్రైః....... అన్యై రనేకై రపి విష్ణుభక్తై రాస్తేఽధిరంగం యతిసార్వభౌమః** " అను రీతిలో అందఱిని ఉజ్జీవింపజేసి, సకలప్రాణిసస్యమును ఫలించునట్లు చేసిరి. అనంతరకాలికులమగు మనలను కూడ ఉజ్జీవింపజేయు సంకల్పముతో శ్రీరంగనాయకి జన్మనక్షత్రమైన పంగునినెల - ఉత్తరా నక్షత్రమున శ్రీరంగనాయకి, శ్రీరంగనాథుడు, అను దివ్యదంపతులు ఇరువురు కలసి **"శేర్‌పాణ్డియన్"** అను దివ్యసింహాసనమున వేంచేసియుండగా భగవద్రామానుజులు శరణాగతిని చేయునపుడు **"శరణాగతి ర్యథాఽవస్థితాఽవిరతాఽస్తు మే"** (ఈ నా శరణాగతి నేను ప్రార్థించిన రీతిలో అవిచ్ఛిన్నముగా ఫలింపవలెను) అని ప్రార్థింపగా, భగవానుడును **"అస్తు తే, తయైవ సర్వం సంపత్స్యతే"** - "అట్లే కానిమ్ము - ఆ ప్రకారమే సిద్ధించగలదు. నా వాక్కు అమోఘము. శ్రీవిభీషణుని విషయమున, అర్జునుని విషయమున నేను చేసిన ప్రతినను ఉదాహరణముగా చూచుకొనుము" - అనుచు ప్రతివచనమును పల్కినట్లు శ్రీగద్యసూక్తివలన స్పష్టము. ఈ విషయము సకలపూర్వాచార్యసమ్మతము. ఇచట ఒక రస్యమైన రహస్యము కలదు. ఈ ప్రతివచనమున భగవానుడు శ్రీరామానుజులను మాత్రమే దృష్టిలో ఉంచుకొన్నచో **"అస్తు తే"** అనిన చాలును. కాని, సర్వేశ్వరుడు సర్వాంతర్యామి కావున **"ఉళ్ళువారుళ్ళత్తెల్లామ్ ఉడనిరున్దరిది"** (ప్రార్థించిన భక్తుని హృదయవర్తియై, వాని భావమును తెలిసికొన్నవాడు) కావున **"సర్వమ్"** అనుచు సంబంధిసంబంధి రక్షణమును కూడ ప్రతిజ్ఞచేసెనని అంగీకరింపక తప్పదు. ఇంతియేకాక, శ్రీరామానుజులనెడి దివ్యతటాకము తననుండి పరమకృపారస ప్రవాహప్రసారము కొఱకుగా డెబ్బదినాలుగు సంహాసనాధిపతులనెడి తూములను అమర్చి, తమకు పిమ్మట జన్మించు ప్రాణులనెడి సస్యలాభమును దృఢపఱచుటకై అవశ్యజ్ఞాతవ్యములైన ఆత్మస్వరూపము, ఉపాయస్వరూపము, పురుషార్థస్వరూపములను బోధించుట రక్షణ ప్రతిబంధనివృత్తికి అపేక్షితము కావున, అందులకై జ్ఞానానుష్ఠాన సంపన్నులైన, తమసంబంధి సంబంధులద్వారా ఆ తత్త్వములను బోధింపజేసి, అస్మదాదిపర్యంతపరిపూర్ణప్రాణిసస్య ప్రాప్తిని భగవానునకు కలుగజేయుచున్నారు. ఆశ్చర్యము! శ్రీస్వామి పరమకృప ఎంత ఘనమైనది. దీనిని కటాక్షించియే **"న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ, కా మవస్థాం ప్రపద్యంతే జంతవో హంత మాదృశః"**, **"రామానుజాంఘ్రిశరణోఽస్మి.......కటాక్షణీయః"**, అనుచు కూరత్తాళ్వాన్, **"అవస్తుప్రస్తావేష్వచరమం వస్తు........ సత్సు వ్యగణిషి"** ఇత్యాదిగా గోవిందభట్టారకులు, **"ప్రయాణకాలే రామానుజార్యం నమత"** ఇత్యాదిగా నడాదూర్ అమ్మాళ్, **"ఉక్త్వా ధనంజయవిభీషణ......"** అని, **"అన్ధోఽనన్ధగ్రహణ"** అనియు, **"భుంక్తే భోగా నవిదితనృప"** అనియును శ్రీవేదాంతదేశికులవారు, **"కాలత్రయేఽపి"** ఇత్యాదిగా శ్రీవరవరమునులును - ఇట్లు సకలపూర్వాచార్యులు శ్రీస్వామిసంబంధమే



ఉత్తారకమని ఏకగ్రీవముగా సాదించినారు. **"రామానుజ"** అనెడి తిరునామము లభింపకున్నచో వేఱుగతి మనకు ఏమి ఉన్నది?, ఓ వరదరాజస్వామీ!, రామానుజ సంబంధమున్నది కావున నన్ను రక్షింపుము - అని, పూర్వము నేనొక పదార్థముగానే కాక, అసత్ప్రాయుడనైయుంటిని. శ్రీరామానుజులు తమ ఉదారగుణముతో నన్ను అందఱికంటే అధికుని కావించిరి - అని, "భక్తి ప్రపత్త్యుపాయములు రెండును మనకు దుర్లభములు, **"శ్రీమతే రామానుజాయ నమః"** - అనుచు అనుసంధించుకొనుచుండిన చాలును" - అనియు, "ఓ శ్రీరంగనాథా! నీవు అర్జునుడు, విభీషణుడను ఇద్దఱిని దృష్టాంతముగా చూపి శ్రీరామానుజుల కిచ్చిన వరబలమును వినిన పిమ్మట ఇక నిశ్చింతగానుంటిని - ఓయతిరాజా! మీరు ప్రార్థింపగా శ్రీరంగనాథుడు చేసిన మీ సంబంధి సంబంధుల రక్షణ ప్రతిజ్ఞ ఒక్కటినే ఉజ్జీవనసాధనముగా అకించనులమగు మేము నమ్మియున్నాము. - అనునది పై ప్రమాణముల తాత్పర్యము. ఈ విధముగా పూర్వాచార్యులు అందఱును శ్రీస్వామిసంబంధమే ఉత్తారకమని, వారి పరమకృపయే లోకోత్తరమనియు ప్రకాశింపజేసిరి. ఈ కారణముచే పూర్వాచార్యగోష్ఠిలోని అందఱు ఆచార్యులు అనువృత్తి ప్రసన్నాచార్యులని, శ్రీరామానుజులు కృపామాత్రప్రసన్నాచార్యులనియును ప్రసిద్ధి కల్గినది. ఈ విధముగా సర్వేశ్వరుడు ప్రాణిసస్యలాభమునకై కర్షకవృత్తిని అవలంబించి, శ్రీరామానుజుల కృపామూలమున ఆ (ప్రాణిసస్య) లాభమును పొందుచున్నాడు. ఇట్లు శ్రీరామానుజుల వైభవసాగరములో కోటిశతాంశమును సంగ్రహించి, ఈ శీర్షికను ఇంతటితో విరమించుచున్నాను. విస్తరస్త్వన్యత్ర.

**శ్రీమన్మహాభూతపురే శ్రీమత్కేశవయజ్వనః ।**
**కాంతిమత్యాం ప్రసూతాయ యతిరాజాయ మంగళమ్ ॥**

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# శ్రీరంగరాజస్తవంలో కవితాచాతురి

ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు (పుత్తూరు అగ్రహారం, తిరుచ్చి) అనుగ్రహించినది

శ్రీపరాశరభట్టార్య: శ్రీరంగేశపురోహితః ।
శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసేమేస్తుభూయసే ॥

శ్రీరామానుజాచార్యులవారి ముఖ్యశిష్యులైన కూరేశులనే శ్రీకవత్సాంక మిశ్రుల కుమారులు శ్రీపరాశరభట్టర్. వీరు, శ్రీరంగంలో నెలకొని ఉండే శ్రీరంగనాథుని గూర్చి రచించిన స్తవం 'శ్రీరంగరాజస్తవం'. ఇది, 127 శ్లోకాలను కల ఉత్తరశతకంతో 105 శ్లోకాలను కల పూర్వశతకంతో కూడుకొన్నది.

తమతండ్రిగారైన కూరేశులవలె భట్టర్ కూడా చాలా గొప్పకవి. ఉత్తమకవిత్వపోకడలు ఈస్తుతిలోని శ్లోకాలలో గోచరిస్తాయి. వాటిలో కొన్ని విన్నపింపబడుతున్నాయి.

శ్రీరంగానికి చుట్టూ ప్రవహించే కావేరీనదిని వర్ణించే సందర్భంలో "తెళివిలాక్కలజ్గల్ నీర్శూళ్ తిరువరజ్గమ్" అని తొండరడిప్పొడి ఆళ్వార్లు 'తిరుమాలై' ప్రబంధంలో పల్కినట్లుగా కావేరీజలం కలత చెంది ప్రవహించడానికి ఒక అందమైన హేతువును భట్టర్ ఉత్ప్రేక్షిస్తున్నారు. నదులకన్నిటికి సముద్రుడు నాథుడని అనడం కవి సమయం.



శ్రీరంగనాయకి అనే లక్ష్మీదేవి సముద్రుని పుత్రిక. అందువల్ల కావేరీ నది ఆమెకు తల్లి. ఆమె తన కలత చెందిన నీటి అలలరూపంలోని హస్తాలతో ముత్యాలను, రత్నాలను కుప్పలుగా కుప్పలుగా గ్రహించి, తీసికొని రావడాన్ని చూస్తే, ఆతల్లి తనకుమార్తెకు, అల్లునకు కానుకగా వాటిని తీసికొనివస్తున్నట్లు తోస్తున్నది. "వధువు తండ్రి నదులకు రాజు. తల్లి అయిన తాను గంగకంటే పవిత్రురాలు. పుత్రిక సంపదలకు అన్నిటికి అధినేత్రి అయిన శ్రీదేవి. ఇక, అల్లుడు అయితే అన్నిలోకాలకు ప్రభువైన శ్రీరంగనాథుడు. ఈ విధంగా ఉండేటపుడు, నేను నా అలలనే చేతులతో తీసికొని వచ్చే ఈ కానుకలు చాలవుకదా! అని కావేరీనది అనే తల్లి కలత చెందినదట. ఈ అందమైన భావాన్ని ప్రకటించేదే ఈక్రింది శ్లోకం.

**దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహమియం శ్రీరేవపుత్రీవరః**
**శ్రీరంగేశ్వర ఏతదర్హమిహకిం కుర్యామితీవాకులా ।**
**చంచచ్చామరచంద్రాచందన మహామాణిక్యముక్తోత్కరాన్**
**కావేరీలహరీకరైర్విదధతీ పర్యేతి సాసేవ్యతామ్ ॥**

నంబెరుమాళ్ అని ప్రసిద్ధిచెందిన ఉత్సవమూర్తికి కుడివైపు, ఎడమవైపు శ్రీదేవి, భూదేవులనే దివ్యదేవేరులు వేంచేసి ఉండడాన్ని దర్శించిన భట్టర్‌కు తామరపూవులతో నిండిన ఒక తటాకంలో రెండు హంసలు క్రీడిస్తున్నట్లు తోచింది. నేత్రాలు, హస్తాలు, పాదాలు-అనే పద్మాలను కల్గినదై, పచ్చని తిరుమేని అనే నాచును కల్గినదైన ఒక పరిమళతటాకంగా నమ్మాళ్వార్లు భగవంతుని కీర్తించిన రీతిని దృష్టిలోపెట్టుకొని ఆ తటాకంలో శ్రీదేవి, ఆమె నీడవంటి భూదేవి హంసలుగా క్రీడిస్తున్నారు- అని అన్నారు.

ఆ శ్లోకం క్రింది విధంగా సాగింది.

**ఉత్ఫుల్ల పంకజతటాకమివో పయాని**
**శ్రీరంగరాజమిహ దక్షిణసవ్యసీమ్నోః ।**
**లక్ష్మీం విహారరసికామివ రాజహంసీం**
**ఛాయామివాభ్యుదయినీ మవనీం చతస్యాః ॥**

నంబెరుమాళ్ అనే ఉత్సవమూర్తికి వెనుక పెరియపెరుమాళ్ అనే మూలమూర్తి, రెండువైపుల ఇద్దఱు దేవేరులు, ముందుగా గరుడుడు వేంచేసి ఉండడాన్ని దర్శించగానే ఈవిధంగా నల్గురిచే నాల్గువైపుల అనుభవింపబడే అందాన్ని కలవాడై, చిఱునవ్వును కల ముఖంతో, శ్రీహస్తాలలో ధరించిన దివ్యాయుధాలతో లోకంలోని అందఱికి అభయాన్ని ఇచ్చే నంబెరుమాళ్‌ను భట్టర్ శరణుపొందే శ్లోకమే ఈక్రింది శ్లోకం.

**అగ్రేతార్క్ష్యేణ పశ్చాదహిపతిశయనే నాత్మనోపార్శ్వయోశ్చ**
**శ్రీభూమిభ్యామతృప్త్యా నయనచులకనైః సేవ్యమానామృతౌఘమ్।**
**వక్త్రేణావిఃస్మితేన స్ఫురదభయగదాశార్‌ఙ్గచక్రాసిముఖ్యైః**
**విశ్వస్మైతిష్ఠమానం శరణమశరణారంగరాజం భజామః ॥**

శ్రీరంగరాజస్తవంలో ఉత్తరశతకం భగవద్రామానుజుల విశిష్టాద్వైత తత్త్వాలను, వేదవాక్యాలను, ఆళ్వార్ల పాశురాలను వివరించే రీతిలో దర్శనమిస్తుంది. లోకంలో ఒకదానిని విడచి ఇంకొకటి ఉండనందున, దేహం, ఆత్మ ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. కారణవస్తువు, కార్యవస్తువు ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. జాతిగుణ కర్మలు వాటిని కల ద్రవ్యంతో ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. ఆ విధంగానే, ఈలోకం అంతా సర్వాత్మ



అయిన భగవానునకు శరీరంగా, సర్వకారణుడైన అతనికి కార్యంగాను, విశేష్యమైన అతనికి విశేషణంగాను అపృథక్‌సిద్ధంగా ఉన్నందున భగవంతుడు లోకాన్ని తానని అభిమానిస్తున్నాడు. అందువల్ల వేదాలు "లోకం అంతా పరమాత్మయే" అని అంటున్నాయి. అందుచేత, "బ్రహ్మాన్ని మాయ ఆవరించినందున జగత్తు మిథ్య" అనికాని, "శరీరమనే ఉపాధితో పరిచ్ఛేదింపబడిన బ్రహ్మమే జీవుడు"అని కాని, "బ్రహ్మమే చేతనాచేతనాలుగా పరిణమిస్తున్నది" అని కాని చెప్పవలసిన అక్కరలేదు- అని ఈక్రింది శ్లోకం ద్వారా పల్కుతున్నారు, భట్టర్.

**దేహోదేహిని కారణేవికృతయో జాతిర్గుణాః కర్మచ**
**ద్రవ్యే నిష్ఠిత రూపబుద్ధివచనాస్తాస్థ్యాత్ తథేదంజగత్।**
**విశ్వం త్వయ్యభిమన్యసే జగదిషే తేనాద్వితీయస్తతః**
**మాయోపాధివికారసంకరకథాకానామ రంగేశ్వర! ॥**

**"సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఐతదాత్మ్యమిదం సర్వమ్", "తత్త్వమసి శ్వేతకేతో"** మొదలైన ఉపనిషద్వాక్యాలు, **"సకల మిదమహంచ వాసుదేవః"** మొదలైన పురాణవాక్యాలు బ్రహ్మాన్ని, జగత్తును ఒకటిగా చేసి పల్కుతున్నారు. దీనికి గల కారణాన్ని పరిశీలించి చూచినపుడు "లోకాన్ని రక్షించడం, సృష్టించడం, ఆయా కార్యాలలో ప్రవర్తింపజేయడం, ప్రళయసమయంలో తన ఉదరంలో లయింపజేసికోవడం, ఒక్కొక్క వస్తువులోను లోపల ప్రవేశించి నిమించడం, అంతటా వ్యాపించడం ఇత్యాది సర్వవ్యాపారాలను భగవానుడు జగత్తును ఉద్దేశించి (జగత్తుకోసంగా) చేస్తున్నాడు. కనుక, లోకం అంతా అతనికి స్వాధీనమైన (శేషమైన) శరీరమవుతున్నది. అందుచేతనే, జగత్తు, పరమాత్మ అయిన అతడు ప్రమాణాలలో గొప్పవారైన శ్రీరామానుజులు మొదలైనవారు

నిర్ణయించారు - అని భట్టర్ ఈ క్రింది శ్లోకంలో వేదాంత సారాన్ని అనుగ్రహించారు.

**స్థిత్యుత్పత్తి ప్రవృత్తి గ్రసననియమనవ్యాపనై రాత్మనస్తే**
**శేషోశేషః ప్రపంచో వపురితి భవతస్తస్య బింభేదవాదాః ।**
**సర్వంఖల్వైతదాత్మ్యం సకలమిదమహం తత్త్వమస్త్యేవమాద్యాః**
**వ్యాఖ్యాతా రంగధామప్రవణ! విజయిభిః వైదికైః సార్వభౌమైః॥**

ఉత్తరశతకంలో భగవానుని పలు అవతారాలను భట్టర్ వర్ణించారు. మీనరూపి అయిన భగవానుడు ఒక నావలో మనువుతో కలసి చరాచరాలైన జీవరాసులను పెట్టుకొని, అవి ప్రళయజలంలో మునిగిపోకుండా తీసికొనిపోయేటపుడు వాటికి భయం కలుగనిరీతిలో వాటితో వినోదంగా సంభాషిస్తూ పయనం సాగించినట్లు శుక్లయజుర్వేదానికి చెందిన శతపథబ్రాహ్మణం తెల్పుతున్నది. ఈ వృత్తాంతాన్ని భట్టర్ ఈక్రిందిశ్లోకంలో ప్రస్తావించారు.

**మీనతనుస్త్వం నావినిధాయ**
**స్థిరచరపరికరమనుమను భగవన్! ।**
**వేదసనాభిస్వోక్తివినోదైః**
**అకలిత లయ భయలవ మముమవహః ॥**

కలియుగంలో చివరలో శ్రియఃపతి కల్కిరూపిగా అవతరించి, దుష్టులను సంహరించి, భూభారాన్ని తగ్గిస్తాడని పురాణాలు పలికే విషయాన్ని ప్రస్తావించి, "ఇపుడు ఉండే దుష్టులను కూడా ఆవిధంగా సంహరించు'' అని భట్టర్ ప్రార్థిస్తున్నారు, ఈశ్లోకంలో-

**కల్కితనుర్ధరణీం లఘుయిష్యన్**



**కలికలుషాన్ విలునాసి పురాత్వమ్ ।**
**రంగనికేత! లునీహి లునీహీతి**
**అఖిల మరుం తుదమద్యలునీహి ॥**

గజేంద్రరక్షణ వృత్తాంతాన్ని వర్ణించేటపుడు **"ఆదిమూలమా!"** అని మొసలి బారిన పడిన గజేంద్రుడు ఘోషించగానే, అతివేగంగా, అతనిని రక్షించడంకోసం, బయలుదేరాడు, భగవానుడు. ఆవిధంగా బయలుదేరినపుడు అలవాటుప్రకారం సేనాధిపతి విష్వక్సేనుడు అవలంబంగా చాచిన హస్తాన్ని గ్రహించకుండా, తీసికొని రాబడిన పాదులకను ధరించకుండా, దేవేరులు తికమకపడగా, వాహనోచితాలైన అలంకారాలు ఏమీలేకుండా ఉండే గరుడుని ఎక్కి, చాలా వేగంగా వెళ్ళిన భగవానుని వేగానికి నమస్కారం- అని చమత్కరిస్తున్నారు, ఈక్రింది శ్లోకంలో భట్టర్.

**అతంత్రిక మూపతిప్రహితహస్తమస్వీకృత**
**ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్ ।**
**అవాహన పరిష్క్రియం పతగరాజమారోహతః**
**కరిప్రవరబృంహితే భగవతస్త్వరాయైనమః ॥**

జీవస్వరూపాన్ని, పరమాత్మస్వరూపాన్ని తెలిపే పలుపలు సంస్కృత ద్రావిడ వేదవాక్యాలను తమ శ్లోకాలలో అక్కడక్కడ పొదిగి, వాటిని భట్టర్ వివరిస్తారు. **"యస్యామతం తస్యమతం మతం యస్యనవేదసః"** అని, "పరమాత్మను పరిచ్ఛేదించి తెలియలేనివాడే ఆ పరబ్రహ్మాన్ని తెలిసిన వాడవుతున్నాడు. ఎవడు, పరమాత్మను పరిచ్ఛేదించి తెలిసినవాడనని పల్కుతున్నాడో, అతడు వాస్తవానికి తెలియనివాడే''అని ఘోషించే కేనోపనిషన్మంత్రాన్ని, **"పుకఖ్రావోమ్ పఖ్రిప్పోమ్ పుకఖ్రోమ్**

**పర్భ్రియోమ్"** అని "భగవానుని పూర్తిగా స్తుతించినట్లు పల్కడం అతనిని నిందించినట్లవుతుంది. అతనిని పొగడలేము-అని విరమించడమే అతనిని పొగడినట్లవుతుంది - అని ఘోషించే ద్రావిడవేదమైన పెరియతిరువందాది పాశురాన్ని భట్టర్ పూర్వశతకంలో ఈ క్రింది శ్లోకంలో పల్కి, వివరించారు.

**అమతం మతం మతమథామతం స్తుతం**
**పరినిందితం భవతి నిందితం స్తుతమ్ ।**
**ఇతిరంగరాజముదజూఘుషత్త్రయీ**
**స్తుమహేవయం కిమితి తన్నశక్నుమః ॥**

సూర్యునిలో ఉండే తేజస్సును కీర్తించే గాయత్రీమంత్రాన్ని, "ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః", "తస్య యథాకప్యాసం **పుండరీకమేవమక్షిణీ"** అని స్వర్ణమయమైన తిరుమేనితో కూడిన సూర్యనారాయణుని పుండరీకాక్షునిగా పలికే ఛాందోగ్యోపనిషత్తు మంత్రాన్ని-

**తేజఃపరం తత్సవితుర్వరేణ్యం**
**ధామ్నాపరేణా ప్రణఖాత్ సువర్ణమ్ ।**
**త్వాం పుండరీకేక్షణమామనంతి**
**శ్రీరంగనాథం తముపాసిషీయ ॥**

అనేశ్లోకంలో ప్రస్తావించి, అవి శ్రియఃపతి అయిన శ్రీరంగనాథుని స్తుతించేవి కనుక అతనిని ఉపాసిస్తున్నాము- అని అన్నారు.

**"చక్షుర్మిత్రస్యవరుణస్యాగ్నేః"** అని దేవతలకు నేత్రభూతుడని, **"సూర్య ఆత్మాజగతస్తస్థుషశ్చ"** అని సమస్త జగత్తును నియమించే ఆత్మ అని సంధ్యావందనమంత్రాలలో అనుసంధింపబడేవాడు శ్రీరంగనాథుడే కనుక **"పశ్యేమ శరదశ్శతమ్"** అని సంధ్యావందనమంత్రంలో వంద ఏండ్లపాటు దర్శించదగినవాడని చెప్పబడేవాడు శ్రియఃపతిగా పురుషసూక్తంలో అనుసంధింపబడే అతడే అనేవిషయాన్ని-



**ఆత్మాస్యగంతుః పరితస్థుషశ్చ**
**మిత్రస్య చక్షుర్వరుణస్యచాగ్నేః ।**
**లక్ష్మ్యాసహోత్పత్తికగాఢబంధం**
**పశ్యేమ రంగే శరదశ్శతంత్వామ్ ॥**

-అని వివరించారు.

తైత్తిరీయ యజుర్వేదబ్రాహ్మణంలో **"యస్యాస్మినతమంతరేమి"** అని "పరమాత్మకు శేషవస్తువై ఉండే నేను అతనిని విడచి ఉండను" అని పలికే వేదవాక్యాన్ని **"యోహమస్మిస సన్ యజే"** అని "నేను ఏవిధంగా ఉన్నానో, ఆవిధంగా ఉండే పరమాత్మను శరణాగతిజ్ఞానరూపమైన యాగంతో ఆరాధిస్తాను" అని పలికే వేదవాక్యాన్ని కూర్చి, వాటిని శ్రీరంగనాథునిపరంగా భట్టర్ ఈక్రిందిశ్లోకంలో అనుసంధించారు.

**యస్యాస్మిపత్యుర్నతమంతరేమి**
**శ్రీరంగతుంగాయతకేశయానమ్ ।**
**స్వభావదాస్యేన చ యోహమస్మి**
**ససన్ యజే జ్ఞానమయైర్మఖైస్త్వమ్ ॥**

నమ్మాళ్వార్లు అథర్వణవేదసారమైన పెరియతిరువన్దాది ప్రబంధంలో- **"ముదలామ్ తిరువురువమ్ మూన్ఱెన్బర్ ఒన్ఱేముదలాకుమ్ మూన్ఱుక్కుమెన్బర్, ముదల్వా! నికరిలకు కారురువా! నిన్నకత్తదన్ఱే**

**పుకరిలకు తామరైయిన్ పూ"**

కొందఱు, త్రిమూర్తులు పరతత్త్వమంటారు. మఱి కొందఱు ఆ త్రిమూర్తులు ముగ్గురు ఒకరే అని, ఆ మూడు మూర్తులకు మూలమైన నాల్గవమూర్తి ఉన్నదని అంటారు. కారుమబ్బు రంగు వంటి రంగును కల జగన్మూలమా! లోకాన్ని సృష్టించిన బ్రహ్మను తనలో కల్గిన తామరపూవు నీ నాభి నుండి పుట్టినందున వాస్తవానికి నీవే పరతత్త్వం'' అని చేసిన పరతత్త్వనిర్ణయాన్ని-

త్రయో దేవాస్తుల్యా స్త్రితయమిదమద్వైత మధికం
త్రికాదస్మాత్తత్త్వం పరమితి వితర్కాన్ విఘటయన్ ।
విభోర్నాభీపద్మో విధిశివనిదానం భగవతః
తదన్యత్భ్రూభంగీ పరవదితి సిద్ధాంతయతి నః॥

అని అనుసంధించారు.

ఇంతవరకు సకల శాస్త్రాలలో పారంగతులైన శ్రీపరాశరభట్టర్‌కు గల మేధావిలాసాన్ని, కవితాప్రణయన చాతుర్యాన్ని లేశమాత్రంగానే ప్రస్తావించడం జరిగింది. విస్తరిస్తే మహాభారతమే కాగలదు.





శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# వేదంలో భగవదవతారాలు

ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు (పుత్తూరు అగ్రహారం, తిరుచ్చి) అనుగ్రహించినది

**మత్స్యావతార ప్రస్తావన (మాధ్యందిన శతపథ బ్రాహ్మణం-మొదటికాండం ఎనిమిదవ అధ్యాయం మొదటి ప్రకరణం):**

మనవేహవై ప్రాతరవనేగ్యముదకమాజహ్రుః- యథేదం పాణిభ్యామనవే జనాయాహరంతి- ఏవమ్. తస్యావనేనిజాగస్యమత్స్యః ప్రాణీ ఆపేదే సహాస్మై వాచమువాచ- "బిభృహిమాపారయిష్యామిత్వా" ఇతి. "కస్మాన్మాపారయిష్యసి" ఇతి. "ఔఘ ఇమాః సర్వాః ప్రజానిర్వోఢాః , తతస్త్వా పారయితాస్మి" ఇతి కథంతే భూతిరితి. సహోవాచ- యావద్వైక్షుల్లకాభవామః, బహ్వీవై నస్తావన్నాష్ట్రా భవతి, ఉతమత్స్యఏవ మత్స్యం గిలతి కుంభ్యాం మాగ్రేబిభరాసి. స యదాతామతి వర్ధై అథకర్షూం ఖాత్వా తస్యాం మాబిభరాసి. సయదాతామతివర్ధై, అథమా సముద్రమభ్యవహరాసి, తర్హి వా అతినాష్ట్రో భవితాస్మి" ఇతి. శశ్వద్ధిఝష ఆస, నహిజ్యేష్ఠం వర్ధతే. "అథ ఇతిథీం సమాం తదౌఘ ఆగంతా తన్మానావ ముపకల్ప్య పాసాసై, స ఔఘ ఉత్థితేనావ మాపద్యాసై. తతస్త్వా పారయితాస్మి" ఇతి. తమేవం భూత్వాసముద్ర మభ్యవజహార. స యతి థీం తత్సమాం పరిదిదేశ- తతిథీసమాం నావముపకల్ప్యఉపాసాం చక్రే. స ఔఘ ఉత్థితే నావమాపేదే. తం సమత్స్య ఉపన్యాపుప్లువే. తస్యశృంగే నావః పాశం ప్రతిముమోచ. తేనైత ముత్తరం గిరిమతి దుద్రావ సహోవాచ. ''అపీపరం వైత్వా, వృక్షేనావం ప్రతిబధ్నీష్వ,

**తంత్వామాగిరౌసంతముదక మంతచ్ఛైత్సీం యావద్ యావదుదకం సమవాయాత్ తావత్ తావదన్వ సర్పాసి" ఇతి. సహతావత్ తావదేవాన్వవ ససర్ప, తదప్యేతదుత్తరస్య గిరేర్మనోరవసర్పణమితి, ఔఘోహతాః సర్వాః ప్రజాః నిరువాహ, అథైహ మను రేవైకః పరిశిశిషే.**

వైవస్వత మనువునకు ఒకనాడు ఉదయకాలంలో (ఈకాలంలో ప్రభువులకు సేవలు చేసేటట్లు) చేతులు కడిగికోవడానికి జలాన్ని తీసికొనివచ్చారు. చేతులు కడిగికోవాలని అతడు తన చేతులలోకి నీటిని తీసికోగా, అందులో ఒక చేప కన్పించింది. "నన్ను నీవు పెంచితే, నిన్ను నేను రక్షిస్తాను' అని ఆచేప పల్కింది. "దేనినుండి నన్ను రక్షిస్తావు?'' అని మనువు అన్నాడు. ప్రళయజలప్రవాహం ప్రాణులనన్నిటిని గ్రహించి కొట్టుకొనిపోతుంది. దాని నుండి నిన్ను నేను రక్షిస్తాను'' అని చేప పల్కింది. "నిన్ను నేను ఏవిధంగా పెంచాలి?'' అని అన్నాడు మనువు. "నేను చిన్నగా ఉన్నాను. నన్ను మింగివేసే విరోధులు పలువురు ఉన్నారు. పెద్దచేప చిన్నచేపను మింగుతుంది. నీ కమండల జలంలో నన్ను పెట్టుకో. దానికంటే పెద్దవాడనై నేను పెరిగితే, నునున సరస్సు తవ్వి అందులో నన్ను పెంచు. అంతకంటే పెద్దగా అయితే సముద్రంలో జీవింపజేయి. అందులో నేను విరోధులందఱికంటే గొప్పవాడను అవుతాను'' అని మత్స్యం పల్కింది. చాలా శీఘ్రంగా ఆ చేప తిమింగలమైనది. ఎందుకంటే, అందఱికంటే గొప్ప పరతత్త్వం కదా ఆ చేపగా వృద్ధిచెందింది! "ఇక కొద్ది దినాలలో ప్రళయజలం రాబోతున్నది. అపుడు ఒకనావను నిర్మించుకొని, నన్ను ఉపాసించు. ప్రవాహంరాగానే, నీవు ఆ నావలో ఎక్కు. ఆతరువాత నిన్ను నేను కాపాడతాను'' అని చేప పల్కింది. ఆచేపను మనువు రక్షించి ఆ విధంగానే సముద్రంలో విడచాడు. అందులో ఆ చేప అదృశ్యమైనది. ప్రవాహజలం ఎన్ని దినాల తరువాత వచ్చిందో అన్ని దినాలు మనువు



ఆమత్స్యాన్ని ఉపాసించాడు. ప్రళయప్రవాహం రాగానే నావను ఎక్కాడు. ఆ మత్స్యం అతనిదగ్గరకు వచ్చింది. దాని కొమ్ముకు తాడుతో ఆ నావను మనువు కట్టాడు. ఆ దారంతో నావను లాగుతూ ఉత్తరదిశలోని పర్వతాన్ని మత్స్యం చేరింది. "నిన్ను రక్షించాను. ఈ పర్వతంలోని వృక్షానికి ఈనావను కట్టివేయి. పర్వతంలో ఉండే నిన్ను ప్రవాహజలం సమీపించలేదు. ప్రవాహం కిందకు పోయే కొలది నీవు పర్వతం నుండి కిందకు దిగు'' అని చేప పల్కింది. మనువు కూడా ప్రవాహజలం తగ్గిన తరువాత పర్వతం కిందకు దిగాడు. (ఉత్తరపర్వతం నుండి మనువు దిగినదారి ఈనాటికీ **"మనువు అవసర్పణ"** మనబడుతున్నది. ప్రళయజలం ప్రాణులనన్నిటినీ తీసికొనిపోయింది. మనువు ఒక్కడే మిగిలాడు)

శతపథ బ్రాహ్మణంలో మత్స్యావతార వృత్తాంతం ఈవిధంగా ప్రస్తావించింది. వేదం కనుక, ఈ మత్స్యం భగవానుడైన విష్ణువే-అనే విషయాన్ని స్పష్టం చేయలేదు. "ఈ మత్స్యం అందఱికంటే జ్యేష్ఠుడని పల్కింది. ఇతిహాసపురాణాలలో ఈ అవతారాన్ని ఎత్తిన భగవానుడు విష్ణువే అని లెక్కలేనన్ని చోట్ల వ్యక్తం చేయబడింది. శ్రీమద్భాగవతం ఎనిమిదవ స్కంధంలోని 25వ అధ్యాయం ఈ వేదవృత్తాంతాన్ని చాలా స్పష్టంగా వివరించింది. దీనినే భట్టర్ ప్రకృతశ్లోకంలో అనుసంధించారు. ఆళ్వార్లు కూడా ఈవృత్తాంతాన్నే అనుసంధించారు.

వేదోపబృంహణమైన శ్రీమహాభారతంలోని విష్ణుసహస్రనామ స్తోత్రంలో గల మత్స్యావతారవైభవాన్ని తెలిపే **"సమీరణః" (225)** అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ భట్టర్ ఉదాహరించిన - **"కృత్వామీన మయీం సద్యః ప్రవివేశ రసాతలమ్, వేదమూర్తిస్తతో వేదానానిన్యే బ్రహ్మణోంతికమ్"** అనే పౌరాణిక శ్లోకాలభావం, ఆవిధంగానే అక్కడే

మత్స్యమూర్తి ధ్యేయరూపాన్ని తెల్పుతూ భట్టర్ "జ్ఞానాది గుణబృందేన పక్షభూతేన భూషితమ్, స్వోత్థబ్రహ్మమదం శృంగనిస్సృతేన విరాజితమ్, కల్పావసాన సమయే వహంతం చైవ చింతయేత్, నౌరూపాం వితతాం క్షోణీం ప్రజాపతిగుణాన్వితామ్" అని, "ముక్తాఫలనిభేనైవ వపుషా నిర్మలేన చ, అనిమీలితనేత్రశ్చ మీనాత్మాయత వాక్తతథా" (మీనరూపాన్ని గ్రహించి, వెంటనే పాతాళాన్ని ప్రవేశించాడు, వేదమూర్తియై వేదాలను బ్రహ్మదగ్గరకు తిరిగి తీసికొనివచ్చాడు''. ''జ్ఞానం మొదలైన గుణసముదాయమే మత్స్యమూర్తి రెండు వైపులగల రెక్కలు. తన పర్వతాన్ని తెలిపే కొమ్మువంటి తల అగ్రభాగంలో ఉండే శృంఖంతో గొప్ప సుగంధాన్ని స్రవింపజేసేవాడు, కల్పచివర ప్రజాపతులతో సత్త్వరజస్తమోగుణాలతో కూడిన నౌకవంటి భూమిని ఉద్ధరించినవాడు, ముత్యాలవంటి వర్ణాన్ని కల నిర్మల దేహం కలవాడై, కన్నులను మూయనివాడై, మౌనముద్రతో ఉండే మత్స్యమూర్తిని ధ్యానించాలి) అనేశ్లోకాలు స్మరణీయాలు.

2. కూర్మావతారాన్ని వర్ణించే ఈశ్లోకంలో "నిఖిలజగదాధార కమఠః" అని సమస్తజగత్తుకు అధారమై ఉండే ఆదికూర్మరూపాన్ని ప్రస్తావిస్తూ "చకర్థ భవన్ ధర్మాన్ కూర్మః" అని ధర్మాలను ప్రవచించిన విషయాన్ని కూడా భట్టర్ ప్రస్తుతించారు. ఈవిధంగా భగవానుడు కూర్మరూపంలో ధర్మప్రవచనాన్ని చేయడం కూర్మపురాణంలో ప్రసిద్ధమైనా, బ్రహ్మకు సృష్టిక్రమాన్ని తెలిపిన సందర్భం యజురారణ్యకంలో కన్పిస్తున్నది. ఈవాక్యాలు ఈక్రిందివిధంగా ఉన్నాయి.

''ఆపోవా ఇదమాసున్ సలిలమేవ. సప్రజాపతిరేకః పుష్కరపర్ణేసమభవత్. తస్యాంతర్మనసి కామస్సమవర్తత ఇదమ్ సృజేయమితి. తస్మాద్యత్పురుషో మనసాభిగచ్ఛతి, తద్వాచాపదతి, తత్కర్మణా కరోతి. తదేషాభ్యనుక్తా. కామస్తదగ్రే సమవర్తతాధి.



మనసోరేతః ప్రతమం యదాసీత్. సతోబంధుమసతి నిరవిందన్. హృదిప్రతీష్యాకవయోమనీషేతి. ఉపైనంతదుపనమతి యత్కామోభవతి య ఏవం వేద సతపోతప్యత. సతపస్తప్త్వా శరీర మధూనుత. తస్యయన్మాం సమాసీత్. తతోరుణాకేతవో వాతరశనాఋషయ ఉదతిష్ఠన్. యేనభాః తేవైఖానసాః యేవాలాః తేవాలఖిల్యాః యో రసః, సోపామ్. అంతరతః కూర్మం రూపం సర్పంతమ్. తమబ్రవీత్ మమ వైత్వఙ్మాం నా సమభూత్ నేత్యబ్రవీత్. పూర్వమేవాహమమిహాసమితి. తత్ పురుషస్య పురుషత్వమే. స సహస్రశీర్షాపురుషః, సహస్రాక్షం సహస్రపాత్ భూత్వోదతిష్ఠత్ తమబ్రవీత్. త్వం వై పూర్వం సమభూః త్వమిదం పూర్వః కురుష్వేతి. స ఇత ఆదాయాపః అంజలి నాపురస్తా దుపాదధాత్. ఏవాహ్యేవేతి తత ఆదిత్య ఉదతిష్ఠత్. సా ప్రాచీదిక్. అధారుణః కేతుర్దక్షిణ త ఉపాదధా ఈత్ ఏవాహ్యగ్ర ఇతి. తతో వా అగ్నిరుదతిష్ఠత్. సాదక్షిణాదిక్. అధారుణః కేతుః పశ్చాదుపాదధాత్. ఏవాహి వాయో ఇతి. తతో వాయురుదతిష్ఠత్. సాప్రతీచీదిక్. అధారుణః కేతురుత్తరత ఉపాదాధాత్. ఏవాహీంద్రేతి. తతోవా ఇంద్ర ఉదతిష్ఠత్. సోదీచీదిక్. అధారుణః కేతుర్మధ్య ఉపాదధాత్. ఏవాహి పూషన్నితి. అధారుణః కేతుర్మధ్య ఉపాదధాత్. ఏవాహి పూషన్నితి. తతోవైపూషోదతిష్ఠత్. సేయందిక్. అధారుణః కేతురుపరిష్టాదుపాదధాత్. ఏవాహి దేవా ఇతి. తతో దేవ మనుష్యాః పితరః గంధర్వాప్సరసశ్చోదతిష్ఠన్. సోర్ధ్వాదిక్. యా విపుషోవిపరాగతాన్. తాభ్యోగురా రక్షాంసి పిశాచాశ్చోదతిష్ఠన్. తస్మాత్తేపరాభవన్. విపుద్భ్యోహి తే సమభవన్" (సృష్టికి ముందు ఈజగత్తు అంతా జలమయమై ఉన్నది. అపుడు బ్రహ్మ తామర ఆకులో జన్మించాడు. అతని మనస్సులో ''ఈలోకాన్ని సృష్టిస్తాను'' అనే కోరిక కల్గింది. అందువల్ల మానవుడు దేనిని మనస్సు తలుస్తాడో, దానినే నోటితో

పల్కుతున్నాడు. దానినే శరీరంతో చేస్తున్నాడు. ఈవిషయాన్ని గూర్చి తరువాత గల ఋక్కు పఠింపబడుతున్నది. "కామమే మొదట ఉన్నది. మనస్సులో మొదటి కార్యవస్తువుగా అది ఉన్నది. మనస్సును నియంత్రించే సృష్టికర్తలు, వ్యక్తమైన ఈ లోకానికి కారణమైన నామాన్ని అవ్యక్తమైన తమ మనస్సులో కోరి నిలుపుకొన్నారు''. దీనిని తెలిసినవానిని అతడు కోరినది అంతా త్వరగా పొందుతుంది. ఆ బ్రహ్మ తపస్సుచేశాడు. అతడు తపస్సు చేసి తన శరీరాన్ని విదల్చుకొన్నాడు. ఆ విధంగా విదల్చినపుడు ఏ మాంసం కిందపడిందో, దాని నుండి అరుణులని, కేతువులనే పేర్లు కల, కృశించిన శరీరాలను కల ఋషులు పుట్టారు. ఆ శరీరం నఖాలనుండి వైఖానస ఋషులు పుట్టారు. ఆ శరీరంలో వాలాలు అనే రోమాలనుండి వాలఖిల్యులు పుట్టారు. బ్రహ్మకుముందు ఏజలం ఉన్నదో, ఆ జలంలోపల కూర్మరూపంతో సంచరించే ఒకనిని చూచి బ్రహ్మ "నీవు నా మాంసం నుండి పుట్టావు కదా'' అని అన్నాడు. "లేదు'' అని కూర్మం పల్కింది. "నేను నీకంటే ముందే ఉన్నాను'' అని అన్నది. ఇందువల్లనే కదా పరమపురుషుడైన ఆకూర్మం పురుషుడని అనబడుతున్నాడు. వేయి శిరస్సులు, వేయి కళ్ళు వేయి కాళ్ళు కల పరమపురుషుడై ఆ కూర్మం వర్ధిల్లింది. ఆ పరమపురుషుని చూచి బ్రహ్మ "నీవు నాకంటే ముందే ఉన్నందున నీవే మొదట ఈసృష్టిని చేయి'' అని అన్నాడు. "ఆ పరమపురుషుడు జలాన్ని చేతిలో తీసికొని "ఆదిత్యుడా! రా'' అని అంటూ తనకు ముందు విడిచాడు. దాని నుండి ఆదిత్యుడు పుట్టాడు. అదే పూర్వదిక్కు అయినది. ఆపిమ్మట ఆ ఆరుణకేతు పురుషుడు తన కుడివైపు జలాంజలిని విడుస్తూ "అగ్నీ! రా'' అని అన్నాడు. అక్కడినుండి అగ్నిపుట్టాడు. అది దక్షిణదిక్కు అయినది. తరువాత ఆరుణకేతుపురుషుడు "వాయూ! రా'' అని వెనుకవైపు జలాంజలిని



విడచాడు. అక్కడినుండి వాయువు పుట్టాడు. అది పడమరదిక్కు అయినది. ఆ తరువాత ఆరుణకేతు పురుషుడు తన ఎడమవైపున "ఇంద్రా! రా'' అని అంటూ నీటిని విడచాడు. అక్కడనుండి ఇంద్రుడు పుట్టాడు. అది ఉత్తరదిక్కు అయినది. ఆ తరువాత మధ్యలో నీరు విడుస్తూ "ఓ పూషా! రా'' అని అన్నాడు. అక్కడనుండి పూషా అనే దేవత పుట్టాడు. అదే అధోదిశ అయినది. ఆ తరువాత ఆరుణకేతుపురుషుడు "దేవతలారా! రండి'' అని పైకి నీటిని విసరాడు. అక్కడనుండి దేవతలు, మానవులు, పితృదేవతలు, గంధర్వులు, అప్సరసలు మొదలైన వారు పుట్టారు. అది ఊర్ధ్వదిశ. ఈ జలాంజలలలో చెదఱిపడిన వాటినుండి అసురులు, రాక్షసులు, పిశాచిగుణం మొదలైన వారుపుట్టారు. జలకణాలనుండి పుట్టినందున అవి నైచ్యాన్ని పొందాయి)

ఇది తైత్తిరీయారణ్యకంలోని కూర్మావతారప్రస్తావన. బ్రహ్మను మొదట నాభీకమలంలో సృష్టించి, తానే మొదట పుట్టాననే అతని గర్వాన్ని తీర్చి, సృష్టిని ఆరంభించిన కూర్మమూర్తి కరుణ ఇందులో తెలుపబడింది. ఈకూర్మమూర్తి పరమపురుషుడే-అనేవిషయాన్ని పురుషశబ్దం చేత అతడు నిర్దేశింపబడినందున, **"సహస్రశీర్షా"** అనే పురుషసూక్త మంత్రాన్ని పఠించినందున సూచింపబడింది. ఇంతేకాక, ఇందులో బ్రహ్మకు సృష్టి ప్రకారాన్ని ఉపదేశించిన విషయం కూడా స్పష్టమవుతున్నది. ఈకూర్మమూర్తి లోకాలకు అన్నిటికి ఆధారభూతుడని, అమృత మధనకాలంలో మందరగిరిని వీపు ధరించాడని ఇతిహాసపురాణాలలో పలుచోట్ల వర్ణింపబడింది.

**కూర్మశబ్ద వ్యుత్పత్తి :-**

శతపథబ్రహ్మణంలోని ఏడవ కాండం-నాల్గవ ప్రపాఠకం-

మొదటి బ్రాహ్మణంలో కూర్మమూర్తి చేసిన సృష్టిప్రకారాన్ని అనువదించి, సృష్టికార్యాన్ని ముందుగా ప్రారంభించినందువల్లనే కూర్మమని కూర్మమూర్తి పిలువబడుతున్నాడని తెలుపబడింది. **"సయత్ కూర్మోనామ, ఏతద్వైరూపం కృత్వా ప్రజాపతిః ప్రజా అసృజత్ యదసృజత- అకరోత్ తత్ యదకరోత్ తస్మాత్ కూర్మః"** (ఈకూర్మరూపాన్ని ధరించి సర్వేశ్వరుడు జీవులను సృష్టించాడు. లోకాన్ని సృష్టించడమనే క్రియను చేసినందువల్ల అతడు కూర్మమనబడ్డాడు. దానివల్ల కూర్మానికి కూర్మమనే పేరు వచ్చింది) అనే సూక్తి గమనించదగినది.

**వేదంలో వరాహవతారం :**

యజుస్సంహితలో (7-1-5) వరాహావతారాన్ని తెలిపే ఈక్రింది వాక్యాలు గోచరిస్తున్నాయి. వేదాంతకౌస్తుభమనే ప్రాచీనగ్రంథంలో ప్రజాపతి శబ్దవిచార సందర్భంలో ఈవేదవాక్యాలు ఉట్టంకింపబడ్డాయి.

**"ఆపోవా ఇదమగ్రేసలిలమాసీత్ తస్మిన్ ప్రజాపతి ర్వాయుర్భూత్వా అచరత్. న ఇమామపశ్యత్. తాం వరాహోభూత్వా అహరత్"** (ఈలోకం మొదట జలమయంగా ఉన్నది. అందులో సర్వేశ్వరుడు వాయురూపిగా సంచరించాడు. అతడు ఈ భూదేవిని చూచాడు. వరాహరూపియై ఆమెను ఉద్ధరించాడు.

ఇక్కడ ప్రజాపతి శబ్దంచేత చెప్పబడేవాడు భూమీనాథుడైన నారాయణుడే అనే దానిని పలు ఇతిహాసపురాణ వచనాలు తెల్పుతున్నాయి. తైత్తిరీయ నారాయణవల్లిలో వేదం కూడా దీనిని స్పష్టం చేసింది. **"ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా"** (నూఱు బాహువులను కల వరాహమూర్తిచే నీవు ఉద్ధరింపబడ్డావు) అనేది ఆ



వాక్యం. ఇక్కడ కృష్ణశబ్దం వరాహమూర్తిని తెల్పుతుంది. దీనికి తగినట్లుగా **"కృషిర్భూవాచకః శబ్దః ణస్తునిర్వృతివాచకః, విష్ణుస్తద్భావ యోగాచ్చ, కృష్ణ ఇత్యభిధీయతే"** ("కృషి"- అనే పదం భూమిని తెల్పుతుంది. "ణః" అనేది ఆనందాన్ని తెల్పుతుంది. విష్ణువు ఆనందరూపి కనుక, భూమికి ఆనందాన్ని కల్గించినందున కృష్ణుడనబడుతున్నాడు) అనే కృష్ణశబ్ద వ్యుత్పత్తి గ్రాహ్యం. నల్లని రూపాన్ని కలవాడనే అర్థం శ్వేతవర్ణుడైన వరాహమూర్తికి అన్వయించదుకదా!

**నృసింహావతార ప్రస్తావన :**

ఋగ్వేద యజుర్వేద విష్ణుసూక్తాలలో పఠింపబడే ఈక్రింది మంత్రం నృసింహావతారాన్ని ప్రస్తుతిస్తున్నది. **"ప్రతద్విష్ణుః స్తవతే వీర్యేణ మృగోనభీమః కుచరోగిరిష్ఠాః, యస్యోరుషుత్రిషు విక్రమణేషు అధిక్షయంతి భువనాని విశ్వా"** (ఏ భగవానుని, చాలా గొప్పవైన మూడడుగుల న్యాసాలలో అన్నిలోకాలు అంతర్భవించాయో, ఆ విష్ణువు సింహమై అవతరించినా అందమైనవాడై, భూమిపై సంచరించేవాడై, పర్వతంపై ఉండేవాడై, వీరకృత్యాలతో స్తుతింపబడుతున్నాడు) అనేది ఆమంత్రం. **"ఆత్మాదేవానాం జనితా ప్రజానాం హిరణ్యదంష్ట్రో బభసోనసూరిః"** (ఛాందోగ్యం-4-3-7) (దేవతలకు ఆత్మయై, ప్రజలకు ఉత్పాదకుడై, అందమైన దంష్ట్రలను కలవాడై, (అందుచేత) విరోధులను గ్రసించేవాడై, సర్వజ్ఞుడై ఉండే వాడు) అనే ఛాందోగ్యంలోని మంత్రం నృసింహావతారపరమని రంగరామానుజ భాష్యంలో తెలుపబడింది. ఇక్కడ **"హిరణ్యదంష్ట్రః"** అనేదానికి "హిరణ్యుని చీల్చిన కోరపళ్ళను కలవాడు" అని రంగరామానుజ భాష్యవివరణం. హరిశబ్దం సాధారణంగా విష్ణువును తెలియజేయడంతోపాటు, విశేషించి నృసింహుని నిర్దేశిస్తుంది

కనుక, వేదంలో హరిశబ్ద ప్రయోగమున్నచోట అంతా నృసింహావతార ప్రసక్తి ఉన్నదని భావించడంలో అడ్డులేదు. ప్రత్యేకించి ఈక్రింది మంత్రం నృసింహావతారాన్ని తెల్పుతున్నదని అభిజ్ఞుల అభిప్రాయం. **"హరిం హరంత మనుయంతిదేవాః విశ్వస్యేశానం వృషభం మతీనామ్"** (అన్నిటికి ఈశ్వరుడు, బుద్ధిమంతులలో గొప్పవాడు, హిరణ్యుని సంహరించేవాడైన నృసింహుని దేవతలు అనుసరిస్తున్నారు) అనే తైత్తిరీయారణ్యకంలో **(3-15)** మంత్రం నృసింహస్వామిని దేవతలంతా అనుసరించారని తెల్పుతున్నది. ఇక్కడ ఈశాన శబ్దం శివుని తెలుపదు. **"పతిం విశ్వస్య"** అని కీర్తింపబడే నారాయణునే తెల్పుతుంది. హరిశబ్దం కూడా **"బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణమేవచ, ప్రసహ్యాహరతే యస్మాత్ తస్మాత్ హరి రిహోచ్యతే"** (బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, యముడు, వరుణుడు అనే అందఱిని ప్రళయకాలంలో సంహరించినందున హరి అనబడుతున్నాడు) అని హరిశబ్దం వివరింపబడినందున నారాయణపరమే.

### వేదంలో వామన త్రివిక్రమావతారం :

వేదంలో అధికంగా ప్రస్తుతింపబడిన అవతారాలు ఇవే. వేదంలో విష్ణువని పఠింపబడిన పలు సందర్భాలు ఉపేంద్రుడైన వామనునే నిర్దేశిస్తాయి. వేదంలో విష్ణుశబ్దం కొన్నిచోట్ల **"ఆదిత్యానా మహం విష్ణుః"** **(గీత)** అనే రీతిలో ఆదిత్యులలో ఒకడైన విష్ణువును, కొన్నిట్లో యజమానిని నిర్దేశించినా, మిగిలిన చోట్ల ఇంచుమించుగా విష్ణుశబ్దం ప్రయోగింపబడినపుడు అది ఉపేంద్రునే తెల్పుతుంది. త్రివిక్రముడై లోకాలను కొలిచిన వృత్తాంతాన్ని స్తుతించే సందర్భాలు అనేకం



**"శంనోవిష్ణురురుక్రమః"** (యజుర్వేదశాంతిపాఠం), **"విష్ణుక్రాంతే వసుంధరా"** (తైత్తి-నారా), **"త్రేధావిష్ణురురుగాయోవిచక్రమే" (7-31), "త్రీణిపదావిచక్రమే" (732), (యః పార్థివానివిమమే రంజాసి విచక్రమాణః త్రేధోరుగాయః" (739), "యస్యోరుషుత్రిషు విక్రమణేషు అధిక్షయంతి భువనానివిశ్వా" (742), "ప్రవిష్ణవేయ ఇదం విమమే త్రిభిరిత్పదేభిః" (742), "యః పార్థివాని త్రిభిరిత్ విగామభిరురుక్రమిష్ట" (761), "ద్వేఇదస్య క్రమణే" (763), "ఉభేతేవిద్మ రజసీ పృథివ్యా విష్ణోదేవత్వం పరమస్య విత్సే" (802), 'త్రిర్దేవః పృథివీమేష ఏతాం క్షేత్రాయ విష్ణుః" (830)** ఇత్యాది మంత్రాలలో లోకం అంతా తన శ్రీచరణాల కింద ఉంచుకొని, ప్రేమతో తడవిన త్రివిక్రముని పరత్వసౌలభ్యవాత్సల్యాది గుణాలను తలచి తలచి వేదం పలవరిస్తున్నది. ఈ రీతిగా త్రివిక్రముని లోకాలను కొలిచిన వృత్తాంతమేకాక, వామనుడైన ఉపేంద్రుడు చేసిన ఇంకా పలు అద్భుతలీలలను కూడా వేదం కొన్నిచోట్ల ప్రస్తావించింది.

### శతపథబ్రాహ్మణంలో వామనావతారవృత్తాంతం :

**"దేవాశ్చవా అసురాశ్చ ఉభయే ప్రాజాపత్యాః పస్పృధిరే. తతో దేవా అనువ్యమివాసుః. అథీహాసురామేనిరే అస్మాకమేవేదం ఖలు భువనమితి. తేహోచుః. హంతేమాం పృథివీం విభజామహై తాం విభజ్య ఉపజీవామేతి. తామౌక్షైశ్చర్మభిః పశ్చాత్ ప్రాంచోవిభజమానా అభీయాః తద్వైదేవాః శుశ్రువుః విభజంతేహవా ఇమామసురాః పృథివీం, ప్రేతతదేష్యామో యత్రేమామసురా విభజంతే, కేతతః స్యామ- యదస్మై న భజేమహీతితే. యజ్ఞమేవ విష్ణుం పురస్కృత్యేయుః. తేహోచుః -**

**అనునోస్యాః పృథివ్యామాభజత అస్త్వేవ నోప్యస్యాం భాగ ఇతి. తేహాసురాః అసూయంత ఇవోచుః- యావదేవైష విష్ణురభిశేతే, తావద్వోదద్మ ఇతి. వామనో హవిష్ణురాస. తద్దేవాన జిహీండిరే -మహద్వైనోదుర్యే నో యజ్ఞసంమిత మదురితి"** (పరమాత్మ నుండి పుట్టిన దేవతలు, అసురులు పరస్పరం కలహించుకొన్నారు. ఒకసారి, దేవతలు అసురులకంటే నైచ్యాన్ని (తక్కువదనాన్ని) పొందినవారయ్యారు. ఆ పిమ్మట "ఈలోకం అంతా మనదే" అని అసురులు తలచారు. "మేము ఈ భూమిని పంచుకొంటాము. పంచుకొని వారి వారి భాగాలను అనుభవిస్తాము" అని అసురులు అన్నారు. (ఆవిధంగానే) దానిని పడమరనుండి తూర్పుకు ఎద్దుచర్మంతో చేసిన మానసాధనంతో (కొలిచేసాధనంతో) కొలిచి, విభజించుకొన్నారు. ఆ విషయాన్ని దేవతలు విన్నారు. "ఈ భూమిని అసురులు విభజించుకొంటున్నారు. అందఱు రండి మనం అందఱం అసురులు భూమిని కొలిచే చోటుకు వెడదాం. ఒకవేళ ఈభూమిలో భాగాన్ని పంచుకోలేక పోయినా, ఇంతకంటే ఏమినైచ్యాన్ని పొందుతాము!'' అని వల్కి యజ్ఞస్వరూపుడైన విష్ణువును పురస్కరించుకొని, వెళ్ళారు. "భూమిని పంచుకోవడంలో మమ్ములను కూడా కలుపుకొనండి. ఇందులో మేము కూడా భాగం పొందాలి." అని దేవతలు అసురులతో అన్నారు. ఆ అసురులు అసూయాగ్రస్తులై, "విష్ణువు ఎంతవరకు వ్యాప్తిస్తాడో, అంతదూరం మీకు ఇస్తాము" అని అన్నారు. విష్ణువు వామనుడుగా కదా ఉన్నాడు. "యజ్ఞపురుషుడైన విష్ణువు పరిమితిలో ఇచ్చినందున, చాలా గొప్ప చోటునే అసురులు ఇస్తారు'' అని తలచి ఆమాటను దేవతలు అనాదరించలేదు)

శుక్లయజుర్వేదానికి చెందిన శతపథబ్రాహ్మణంలోని మొదటికాండం - రెండవ ప్రపాఠకం - మూడవ బ్రాహ్మణంలో



వామనావతారాన్ని గూర్చిన ఈ ఇతిహాసం ఉదాహరింపబడింది.

ఇతిహాసపురాణాలలో కన్పించే వామన వృత్తాంతానికి, ఈవృత్తాంతానికి కొన్ని తేడాలు కన్పిస్తాయి. ప్రకృతంలో మహాబలి ప్రసక్తిలేదు. అసురులు మాత్రమే ప్రస్తావింపబడ్డారు. వామనుడు బలిని వంచించి మూడడుగులతో జగత్తును ఆక్రమించిన వృత్తాంతం కూడా కన్పించదు. ఇటువంటి తేడాలను కల్పభేదాన్ని బట్టి సమన్వయించుకోవాలి. అంటే, ప్రకృత వృత్తాంతం, ఇతిహాసపురాణాలలోని వృత్తాంతం వేర్వేరు కల్పాలలో సంభవించినవిగా భావించాలి. అంతేతప్ప, వీటిలో ఏదీ అప్రమాణం, అసత్యంకాదనే వాస్తవాన్ని గ్రహించాలి. శాస్త్రం యథాభూతవాది కదా! నృసింహావతారం వంటి ఇంకా పలు అవతారాలు కూడా వేర్వేరు పురాణాలలో వేర్వేరు రీతులలో వర్ణింపబడడాన్ని కూడా ఈవిధంగా సమాధానించాలి.

మూడడుగులతో లోకాలను కొలిచిన వృత్తాంతం శతపథ బ్రాహ్మణంలోనే ఇంకా పలుచోట్ల అనుసంధింపబడింది.

**"యజ్ఞోవైవిష్ణుః సదేవేభ్య ఇమాం విక్రాంతిం విచక్రమే. యైషామియం విక్రాంతిః. ఇదమేవ ప్రథమేన పదేన పస్పార. అథేదమంతరిక్షం ద్వితీయేన, దివముత్తమతే"** (విష్ణువు యజ్ఞస్వరూపి కదా! అతడు దేవతలకోసం పదన్యాసాన్ని చేశాడు. దేవతలకోసం చేయబడిన ఈ పాదన్యాసంలో- మొదటిపాదంతో భూమిని కొలిచాడు. రెండవపాదంతో అంతరిక్షాన్ని, మూడవ పాదంతో దేవలోకాన్ని కొలిచాడు. యజమాని కోసం యజ్ఞస్వరూపి అయిన ఈవిష్ణువే ఈవిష్ణుక్రమాన్ని చేశాడు)

ఇది, శతపథ బ్రాహ్మణంలోని మొదటి కాండం, ఏడవ ప్రపాఠకం-

నాల్గవ బ్రాహ్మణంలోను, మూడవ కాండం అయిదవ ప్రపాఠకం, రెండవ బ్రాహ్మణంలోను కన్పిస్తున్నది. శతపతబ్రాహ్మణంలోని అయిదవకాండం రెండవ ప్రపాఠకం నాల్గవ బ్రాహ్మణంలో త్రిషంయుక్తాతి యాగాన్ని గూర్చిపలికేటపుడు వేదం **"వైష్ణవాః పురుషాః"** అని రెండుచోట్ల పల్కింది. దీనిని సాయణాచార్యులవారు **"విష్ణోః అవతారస్వీకారేణ మనుష్య సంబంధాత్ మనుష్యాః సర్వేవైష్ణవాః విష్ణ్వధిష్ఠితా ఇత్యార్థః"** (విష్ణువు అవతరించి, అందఱు మానవులతో సంబంధాన్ని పొందినందున మానవులు అందఱు వైష్ణవులే. అంటే, విష్ణువుచే అధిష్ఠింపబడినవారే- అని అర్థం) అని వ్యాఖ్యానించారు.

అయిదవకాండం, మూడవప్రపాఠకం, నాల్గవ బ్రాహ్మణంలో పులిచర్మంలో విష్ణుక్రమాన్ని విధించేటపుడు **"విష్ణోర్విక్రమణమసి, విష్ణోర్విక్రాంతమసి, విష్ణోః క్రాంతమసి" ఇతి. ఇమేవైలోకా విష్ణోర్విక్రమణం, విష్ణోర్విక్రాంతం, విష్ణోఃక్రాంతమ్"** అని ముల్లోకాలను విష్ణువుయొక్క పాదన్యాసాలని పల్కుతూ విష్ణువుయొక్క త్రివిక్రమ వృత్తాంతాన్ని తెల్పింది.

ఆఱవకాడం నాల్గవ ప్రపాఠకం. నాల్గవ బ్రాహ్మణంలో సమిధ పరిమితిని విధించేటపుడు **"ప్రాదేశ మాత్రీభవతి. ప్రాదేశమాత్రో వైగర్భోవిష్ణుః, ఆత్మసంమిత మేవాస్మి న్నేతత్ సంభూతిం దధాతి"** (సమిత్తు నిడివిని కల్గినది. అదితి గర్భనుండి పుట్టిన విష్ణువు నిడివిని కల్గినవాడుకదా! తన నిడివిని కల సంపదను ఇందులో నిలుపుతున్నాడు, విష్ణువు) అని విష్ణువు ఎత్తిన వామనావతారాన్ని వేదం ఇంకొక చోట కూడా పల్కింది. ఇటువంటవి ఇంకా చాలా ఉన్నాయి.

**శతపథబ్రాహ్మణంలో వరాహావతార ప్రస్తావన :**

**"అథవరాహవిహితమ్ "ఇయత్యగ్ర ఆసీత్" ఇతి. ఇయతీహవా ఇయమగ్రే పృథివ్యాస ప్రాదేశమాత్రీ. తాం యమూష ఇతివరాహ ఉజ్జఘాన. సోస్యాః పతిః ప్రజాపతిః. తేనైవైన మేతస్మిన్ మిథునేన ప్రియేణ ధామ్నా సమర్ధయతి. కృత్స్నం కరోతి".**

(తరువాత **"ఇయత్యగ్ర ఆసీత్"** అనే మంత్రంతో వరాహం చేత పెకలించబడిన మట్టిగడ్డను లేడిచర్మంపై పెట్టాలి. ఈ భూమి మొదట ఏతావన్మాత్రంగా కదా ఉన్నది. సముద్రంలో చిన్న ప్రాదేశాన్ని పొందినదిగానే ఉన్నది. ఆ భూమిని వరాహమూర్తి అయిన పరమాత్మ "ఓ భూమీ! ఎక్కడ మఱుగుపడ్డావు?" అని పల్కి పైకి ఉద్ధరించాడు. అతడే జీవులకందఱికి తండ్రియై, ఈమెకు పురుషుడై ఉండేవాడు. అందువల్ల మహీవరాహరూప మిథున సంబంధం కల ఈ కర్మతో ఈ యాగంలో ప్రవర్గ్యాన్ని భోగ్యమైన తేజస్సుతో నింపుతున్నాడు. యాగాన్ని కూడా సుసంపన్నం చేస్తున్నాడు) **(శతపథ-14-1-2).**

అందఱికంటే ఉన్నతుడైన పరమాత్మ జాతులన్నిటిలో అథమమైన మత్స్యకూర్మ వరాహజాతులలో అవతరించిన రీతిని వేదం విశదంగా పల్కింది. ఆ తరువాత పరత్వాన్ని ప్రదర్శించే నారసింహ, వామన, త్రివిక్రమావతారాలను కూడా స్పష్టంగా తెల్పింది. పరశురామావతారం ఆవేశావతారమైనందున దీనిని గూర్చిన ప్రస్తావనను వేదం చేసి ఉండకపోవచ్చునని తోస్తుంది. రామకృష్ణాద్యవతారాలు కూడా సౌలభ్యగుణ ప్రధానమైనవి కనుక, పరత్వాన్ని ప్రధానంగా పలికే వేదంలో వాటి ప్రస్తావన వివరంగా లేదు. వాటి సూచనలు మాత్రం కన్పిస్తాయి.

**యజుర్వేదంలో రామావతార సూచన :**

తైత్తిరీయ యజుర్వేదసంహితలో మూడవకాండం, అయిదవ

ప్రశ్నలోని రెండవ అనువాకంలో శ్రీరామాయణ వృత్తాంతం సంగ్రహంగా పేర్కొనబడింది.

**"ఋషయోవా ఇంద్రం ప్రత్యక్షం నాపశ్యన్ తం వసిష్ఠః ప్రత్యక్షమపశ్యత్. సోఽబ్రవీత్. బ్రాహ్మణం తేవక్ష్యామి యథాత్వత్పురోహితాః ప్రజాః ప్రజనిష్యంతే. అధిమేతరేభ్య ఋషిభ్యో మాప్రవోచ ఇతి. తస్మా ఏతాన్ స్తోమభాగాన బ్రవీత్. తతోవసిష్ఠపురోహితాః ప్రజాః ప్రజాయంత. తస్మాద్వాసిష్ఠో బ్రహ్మకార్యః. ప్రైవజాయతే"**

**(ఋషయో వా ఇంద్రం ప్రత్యక్షం నాపశ్యన్)** ఋషులు సర్వేశ్వరుని ప్రత్యక్షంగా చూడలేదు- అని అర్థం. దేవేంద్రునకు ఈ మహిమ పొసగదు కనుక, **"ఇది పరమైశ్వర్యే"** అనే ధాతువును బట్టి గొప్పఐశ్వర్యాన్ని కల సర్వేశ్వరుడే ఇక్కడ ఇంద్రశబ్దం చేత చెప్పబడుతున్నాడు. అని తెలియాలి.

**(తం వసిష్ఠం ప్రత్యక్షమవశ్యత్)-** ఆ పరతత్త్వాన్ని వసిష్ఠుడు ప్రత్యక్షంగా దర్శించాడు.

**(సోఽబ్రవీత్)-** ఆ పరమపురుషుడు పలికాడు.

**(బ్రహ్మణం తే వక్ష్యామి యథా త్వత్పురోహితాః ప్రజాః ప్రజనిష్యంతే)** - నిన్ను పురోహితునిగా కల్గిన, గొప్ప జన్మను కలవారైన కొందఱు జన్మించబోయే విషయాన్ని తెలిపే వేద భాగాన్ని నీకు తెల్పుతాను- అని అర్థం. ఇక్కడ **"ప్రజాః"**-అనేది **"శ్రేయాన్ భవతి జాయమానః"** అనే విధంగా గొప్ప అవతారజన్మను కల రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను తెల్పుతుంది.

**(అధమేతరేభ్యఋషిభ్యోమాప్రవోచ ఇతి)-** "మిగిలిన ఋషులు



నన్ను గూర్చి చెప్పవద్దు"- అని పరమపురుషుడన్నాడు.

**(మామాప్రవోచః)-** "నన్ను గూర్చి పలుకవద్దు" అని అన్నందున వసిష్ఠుని పురోహితునిగా కలవారుగా జన్మించబోయే బిడ్డలు తానే- అని పరమపురుషుడు తెలిపాడు. **"ఆత్మానం మానుషం మన్యే"** అని తనను మానవునిగా తనను మానవునిగా మఱుగుపరచుకొన గోరినవాడైనందున, మిగిలిన ఋషులకు చెప్పవద్దని నియమించాడు.

**(తస్మా ఏతాన్ స్తోమభాగానబ్రవీత్)-** ఆ వసిష్ఠునకు తన రామావతారాన్ని తెలిపే వేదభాగాలను చెప్పాడు.

**(తతో వసిష్ఠపురోహితాః ప్రజాః ప్రజాయతః)** పరమపురుషుడు పల్కినట్లే చిరకాలం గడిచిన తరువాత వసిష్ఠుని పురోహితునిగా కల దశరథపుత్రులు జన్మించారు.

**(తస్మాద్వానిష్ఠోబ్రహ్మకార్యః)-** అందువల్ల వసిష్ఠ గోత్రంలో పుట్టిన వారిని యాగంలో బ్రహ్మగా చేయాలి.

**(ప్రైవజాయతే)-** ఆవిధంగా వసిష్ఠగోత్రంలో పుట్టిన వానిని బ్రహ్మగా పెట్టుకొని యాగం చేసేవాడు పరమపురుషునివలె గొప్పతనంతో జన్మిస్తాడు.

ఈ వేదవాక్యాలలో రామావతార సూచన చేయబడింది-అనేది స్పష్టం-అని వేదవిత్తములైన కోయిల్ కుండలం రంగరాచార్యస్వామివారు తెలిపారు. తైత్తిరీయసంహిత నాల్గవ కాండం, రెండవప్రశ్న అయిదవ అనువాకంలో యాగంలో లాంగలపద్ధతిని (నాగలి దున్నిన దారిని) స్తుతించే ఒక మంత్రం "నాగలి చాలు మార్గంలో జన్మించినది" అనే అర్థాన్ని కల సీతాదేవి చెందిన స్తుతిగా కూడా అర్థాన్ని ఇవ్వడం ద్వారా

సీతాదేవి అవతారాన్ని సూచిస్తున్నది. **"ఘృతేన సీతామధునా సమక్తా విశ్వైర్దేవైరనుమతామరుద్భిః, ఊర్జస్వతీ పయసా పిన్వమానాస్మాన్ సీతే పయసా భ్యావవృత్స్వ"** (తేనెతో, నేతితో నాగటి చాలు తడుపబడింది. అందువల్లనే దేవతలందఱిచే, మరుత్తులచే ప్రశంసింపబడుతున్నది. సీతా! ఊర్జస్సును కల పరమాత్మను తన అధీనంలో కల్గినది- అని అర్థం. కలిసంతారణోపనిషత్తు, రామతాపనీయోపనిషత్తు, ఇంకా మఱికొన్ని ఉపనిషత్తులలో రామావతార ప్రస్తావన ఉన్నా, ఆ ఉపనిషత్తులను పూర్వాచార్యులు వ్యాఖ్యానించనందున రామావతార విషయంలో ముఖ్యప్రమాణాలుగా గ్రహించలేము.

**ఋగ్వేదంలో కృష్ణావతార ప్రస్తావన :**

ఋగ్వేదం ప్రథమమండలం ఇరవై రెండవ అధ్యాయం నూట అరవైనాల్గవ సూక్తం. "అస్యవామస్య" అని ఆరంభమయే మంత్రంతో మొదలవుతున్నది.

**"అస్యవామస్యసూక్తం తు జపే చ్చాన్యత్రవాజతే ।**
**బ్రహ్మహత్యాదికం దగ్ధ్వావిష్ణులోకం చ గచ్ఛతి ॥**

("అస్యవామస్య" అనే సూక్తాన్ని జలంలో కాని, వేఱొక చోటకాని జపించాలి. ఆవిధంగా జపిస్తే బ్రహ్మహత్య మొదలైన పాపాలు నశించి, విష్ణులోకాన్ని పొందుతాడు) అనే శౌనకుల ఋగ్విధాన శ్లోకంలో (24) ఈ సూక్త వినియోగం చెప్పబడింది. వృద్ధహారీతస్మృతిలో కూడా ఇది కృష్ణార్జనలో వినియోగింపదగినదని చెప్పబడింది. ఈ సూక్తం పరమాత్మను గూర్చినదే అనేది, **"ద్వాసుపర్ణా"** (20) అనే ఉపనిషత్ ప్రసిద్ధమైన మంత్రం, **"ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహుః అదోదివ్యః గసుపర్ణో గరుత్మాన్, ఏకం సత్ విప్రాః బహుధా వదంతి అగ్నిం యమం**



**మాతరిశ్వాన మాహుః"** (46) (ఇతనిని జ్ఞానులు ఇంద్రుడని, వరుణుడని, మిత్రుడని అగ్ని అని అంటారు. ఇతడే పరమపదంలో ఉండే సుపర్ణుడైన గరుడుడు, పరమాత్మ ఒకడే. అయినా అగ్ని అని, యముడని, వాయువని జ్ఞానులు దానిని పలుపేర్లతో పిలుస్తున్నారు) అనే పరమాత్మ ప్రతిపాదక మంత్రం ఇందులో అంతర్భవించి ఉన్నందున వ్యక్తమవుతుంది. ఇంద్రాది దేవతలు ప్రాకృతులు, గరుడుడు అప్రాకృతుడు అనేది స్ఫురించేటట్లు **"దివ్యః"** అని గరుడునకు విశేషణం ప్రయోగింపబడడం గమనార్హం. **"తేననారాయణః స్మృతః"** (1-10) అని మొదట **"విద్యాత్తు పురుషం పరమ్"** (12-122) అని చివరలో పరమపురుషుడైన నారాయణుడే పరమాత్మ అని నిశ్చయించిన మనువు కూడా **"ఏన మేకే వదంత్యగ్నిమ్"** (12-123) అనే శ్లోకంలో ఈమంత్రంలో పలు పేర్లను కల, ఒక విలక్షణతత్త్వంగా వెలిగేవాడు ఆ పరమపురుషుడే - అనే విషయాన్ని ఉపబృంహణం చేస్తూ చూపారు. ఈ సూక్తంలో **"విష్ణోః తిష్ఠంతి"** అనే ముప్ఫై ఆఱవ మంత్రంలోను, **"కృష్ణం నియానమ్"** అనే నలభై ఏడవ మంత్రంలోను పఠింపబడడం బట్టి, వృద్ధహారీత వినియోగాన్ని బట్టి ఇందులో విష్ణువు అవతారరూపమైన కృష్ణుడు గానం చేయబడుతున్నాడు- అని పరకాలమం ్యతీశులు హయశిరోపాఖ్యానంలో (271 పేజిలో) నిర్ణయించారు.

**ఉపనిషత్తులలో కృష్ణావతారం :**

ఉపనిషత్తులలో కృష్ణుని గూర్చిన ప్రస్తావనలు చాలా కన్పిస్తాయి. ముఖ్యంగా, ఛాందోగ్యోపనిషత్తులో ఒకచోట "సర్వం కృష్ణార్పణమ్" అని ఈనాటి వరకు మనం అందఱం అనుసంధించడానికి మూలమైన ఒక ఇతిహాసం తెలుపబడింది. ఈ ఉపనిషత్తులో పదకొండవ, పదిహేడవ

ఖండంలో పురుషుని యజ్ఞంగా దర్శించడమనే పురుషవిద్యను విస్తృతంగా పఠించింది. ఈ విద్య శ్రీకృష్ణునకు శేషభూతమైనది, కృష్ణునకు ప్రీతిని కలిగించేది-అనే విషయాన్ని తెలుపడం కోసం **"తద్ధైతత్ ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీ పుత్రాయోక్త్వా ఉవాచ అపిపాస ఏవ స బభూవ"** (ఆ విధమైన ఈపురుషవిద్యను అంగిరోగోత్రంలో పుట్టిన ఘోరుడనే ఋషి ''దేవకీపుత్రుడైన శ్రీకృష్ణునకు సమర్పింపబడింది'' అని పల్కి అనుసంధించాడు. చివరికాలంలో అతడు దాహం మొదలైన ప్రాకృత గుణాలు తీరినవాడై ముక్తుడయ్యాడు) అనే ఐతిహ్యాన్ని వేదం ఆదరంగా పల్కింది.

ఇక్కడ వేదం **"ఉక్త్వా ఉవాచ"** అని రెండుమార్లు పఠించినందున **"కృష్ణాయ దేవకీ పుత్రాయ ఇతి ఉక్త్వా ఏతత్పురుష యజ్ఞమువాచ"** అని **"ఇతి"** శబ్దాన్ని చేర్చుకొని అర్థాన్ని చెప్పడం సరసం. **"కృష్ణాయ"** అని మాత్రం అంటే, అతని **(ఆ ఋషి)** శిష్యులలో ఒకడై ఉండవచ్చునని పలువురు భ్రమించే అవకాశమున్నదని తలచి, **"కృష్ణాయ దేవకీపుత్రాయ"** (దేవకీపుత్రుడైన కృష్ణునకు) అని నిస్సందేహంగా వేదం పల్కింది.

**(కృష్ణాయ)** ఉభయవిభూతినాథుడై ఉండేవానికి అని అర్థం. **"కృషిర్భూవాచకః శబ్దోణశ్చ నిర్వృతివాచకః, విష్ణుస్తద్భావ యోగాచ్చకృష్ణ ఇత్యభిధీయతే"** (**"కృషి"** అనే పదం భూమి మొదలైన ఈ లీలావిభూతిని తెల్పుతుంది. **"ణ"** అనేపదం ఆనందభూమి అయిన నిత్యవిభూతిని తెల్పుతుంది. విష్ణువు ఈ రెండిటిని కలవాడు కనుక కృష్ణుడని అనబడుతున్నాడు) అని కృష్ణశబ్దనిరుక్తి చెప్పబడుతున్నది. భూమిలో ఉండేవారికి ఆనందాన్ని ఇచ్చేవాడు, ఆనందభూమియై ఉండేవాడని కూడా కృష్ణశబ్దానికి అర్థాన్ని చెప్పవచ్చు. నల్లని రంగు కలవాడనే అర్థం కూడా



ప్రసిద్ధం.

**(దేవకీపుత్రాయ)-** ఈ విధంగా ఉభయవిభూతినాయకుడై, ఆనందమయుడై, **"ఏషహ్యేవానందయాతి"** అనే రీతలో ఇతరులకు ఆనందాన్ని కల్గించే ఈ పరమపురుషుడు, ఈలోకంలో దేవకి అనే స్త్రీకి పుత్రుడై జన్మించాడే! అని ఆశ్చర్యపడుతున్నది, వేదం. **"పితాపుత్రేణ యోనిమాన్ యోనియోనా నావేదవిస్మనుతే తం బృహంతమ్"** (సర్వలోకాలకు తండ్రి అయినవాడు తన పుత్రులలో ఒకనిని తండ్రిగా స్వీకరించి, అన్ని జాతులలో జన్మిస్తున్నాడు. వేదాన్ని తెలియనివారు అతడే పరతత్త్వమనేది తెలియలేరు) అని, **"యువాసువాసాః పరివీత ఆగాత్ న ఉశ్రేయాన్ భవతి జాయమానః"** (యువకుడై, అందమైన పీతాంబరాన్ని ధరించినవాడై, నిత్యసూరులచే పరివేష్ఠింపబడినవాడై పరమపురుషుడు ఇక్కడకు వచ్చాడు. అతడు జన్మించే కొలది గొప్పవాడవుతున్నాడు) అని, **"అజాయమానో బహుధావిజాయతే, తస్యధీరాః పరిజానంతి యోనిమ్"** (జన్మరహితుడైనా పలురీతులలో పరమపురుషుడు జన్మిస్తున్నాడు. బుద్ధిమంతులలో గొప్పవారు అతని అవతార రహస్యాన్ని తెలిసికొంటున్నారు) అని వేదాలు, **"జన్మకర్మచ మేదివ్యమ్"** (నా పుట్టుక, లీలలు దివ్యాలు) అని దేవకీపుత్రుడైన ఆ కృష్ణుడు, **"నిలైవరమ్బిల పలపిఱప్పాయ్ ఒళివరుముఴునలమ్"** మొదలైన చోట్ల దివ్యసూరులు భగవానుని అవతారాలను శ్లాఘించారు.

**(కృష్ణాయదేవకీపుత్రాయ)** దేవకీపుత్రుడైన కృష్ణునకు శేషభూతమైనది, నేను అనుష్ఠించే విద్య-అని కాని, ''కృష్ణునకు సమర్పింపబడింది'' అనిగాని అర్థాన్ని చెప్పవచ్చు.

**(అపిపాన ఏవ సబభూవ)-** ఈ విధంగా పురుషవిద్యను

కృష్ణునకు శేషంగా అనుసంధించినందున ఆఋషి ముక్తుడయ్యాడు-అని అర్థం.

ఈ విధంగా ఈ వృత్తాంతం ద్వారా సర్వవిద్యోపాస్యుడు, సర్వకర్మ సమారాధ్యుడు శ్రీకృష్ణుడే అని తెలుపబడింది. ఇంతేకాక, వరాహమూర్తిని గూర్చిన **"కృష్ణేన శతబాహునా"** అనే తైత్తిరీయమంత్రంలో కూడా కృష్ణవతారం వివక్షితమని చెప్పవచ్చు. శ్వేతాశ్వతరోపనిషత్తులో పరమపురుషుడు **"యద్వనద్వాన్"** (శ్వేతా-5-4) (యదుకులానికి చెందినవాడు), **"గిరిచన్ద"** (3-5) (పరత్వంతో గోపాలకు సుఖాన్ని కల్గించినవాడు), **"గిరింద్ర"** (3-6) (పర్వతంతో రక్షించినవాడు) అని కృష్ణావతార వృత్తాంతసూచకాలైన నామాలతో నిర్దేశింపబడ్డాడు. **"దధిక్రావుణ్ణో అకారిషమ్ జిష్ణోరశ్వస్యవాజినః"** (పెరుగుకు తాను వశంచేసికొనేవాడు, వేగంగా అశ్వరూపంలో వచ్చిన అసురుని జయించినవాడైన పరమాత్మకోసం అనుష్ఠించాను) అని సంధ్యావందనంలో నిత్యం అనుసంధించే మంత్రంలో కృష్ణవృత్తాంతం అనుసంధింపబడడం స్పష్టం. దీనిని శ్రుతప్రకాశికాచార్యులవారు తమ సంధ్యావందన భాష్యంలో తెలిపారు కూడా. **"బ్రహ్మణ్యో దేవకీపుత్రః"** అనే నారాయణోపనిషత్తులోని మంత్రం దేవకీపుత్రుడైన కృష్ణుని పరమాత్మగా పల్కింది. ఈ రీతిలో దేవకీపుత్రుడని రెండుచోట్ల పఠించినట్లే **"వాసుదేవాయధీమహి"** అని తైత్తిరీయ నారాయణవల్లిలో **"తదస్మ్యహం వాసుదేవః"** అని బ్రహ్మబిందూపనిషత్తులోను వాసుదేవపుత్రుడుగా రెండుచోట్ల వేదం పల్కింది. **"హరేకృష్ణ"** అని కలిసంతారణోపనిషత్ మంత్రంలో కూడా కృష్ణనామం పఠింపబడింది. పూర్వాచార్యులు ప్రస్తావించని పలు ఉపనిషత్తులలో కృష్ణుని నామం కీర్తింపబడింది.



కల్క్యవతారం భవిష్యదవతారం కనుక వేదం దీనిని ప్రస్తావించలేదు-అని తోస్తుంది.

భగవానుని అవతారాలలో ప్రధానమైన దశావతారాలను ఒకటిగా చేర్చి తైత్తిరీయారణ్యకంలో మూడవప్రశ్న పదకొండవ అనువాకంలో **"ఇంద్రస్యాత్మానం దశధాచరంతం బ్రహ్మన్వ విందత్"** (ఇంద్రునకు ఆత్మయై ఉండేవాడు, పదివిధాలుగా అవతారాలను ఎత్తేవాడైన పరమాత్మను బ్రహ్మచేరాడు) అని తెల్పింది. ఈవిధంగా భగవదవతారాలు ముఖ్యంగా పది అయినా, అతడు ఎత్తిన అవతారాలకు లెక్కలేదు-అనే దానిని వేదమే **"ఇంద్రస్యాత్మానయం శతధాచరంతమ్"** (ఇంద్రునకు ఆత్మయై వందలసంఖ్యలోని అవతారాలను ఎత్తినవానిని) అని ఈ అనువాకంలో తెల్పింది. ఇక్కడ శతశబ్దం ఆనంత్యాన్ని తెల్పుతుంది. **"బహుధావిజాయతే"** అని పురుషసూక్తం కూడా అన్నది. ఈ అనువాకం పూర్తిగా భగవానునకు చెందినదే-అనేది దీనిని జాగ్రత్తగా పఠించేవారికి తెలియగలదు. **"అంతస్సముద్రేమనసా చరంతమ్"** (సముద్రమధ్యంలో మనస్సుతో సంచరించేవానిని) అని, **"అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా"** (జనుల మనస్సులో ప్రవేశించి నియమించే సర్వాంతర్యామి) అని, **"ఏకః సత్ బహుధావిచారః"** (ఒకడై ఉన్నా పలువిధాలుగా సంచరిస్తున్నాడు) అని, **"శతం శుక్రాణి యత్రైకం భవంతి సర్వేవేదా యత్రైకం భవంతి సర్వేహోతారోయత్రైకం భవంతి సర్వాః ప్రజాయత్రైకం భవంతి"** (అసంఖ్యాకమైన జ్యోతులు ఎక్కడ ఒకటి అవుతున్నాయో, అన్నివేదాలు ఎవనిలో ఒక్కటి అవుతున్నాయో, హోతలు అందఱు ఎక్కడ ఎవనిలో ఒకటి అవుతున్నారో, జీవులందఱు ఎవనిలో ఒకటి అవుతున్నారో) అని, **"చతుర్హోతారో యత్ర సంపదం గచ్ఛంతి దేవైః"** (ఎవడు, దేవతలందఱికి అంతర్యామియై ఉన్నందున, కర్మలు

దేవతలకు ఆరాధనలై ఉన్నాయి-అనే గొప్పతనాన్ని పొందుతున్నాయో), **"సహైవ సంతం విజానంతి దేవాః"** (తోడుగా ఉండే ఇతనిని దేవతలను గూర్చి పల్కి, **"సహరిర్వసువిత్తమః"** (సంపదలను కలవారిలో హరి గొప్పవాడు) అని భగవదసాధారణమైన హరి నామాన్ని పఠించి, ఈ పరమాత్మ ఎవరో స్పష్టం చేసింది. ఈ అనువాకానికి తరువాత అనువాకం పరమపురుషుని తెలిపే పురుషసూక్తమనే విషయాన్ని గమనించాలి. **"షట్త్రింశాంశ్చ కల్పయంతః"** (ఋక్సంహిత- 10-114-6) (ముప్పై ఆఱు అవతారరూపాలను జ్ఞానులు నిరూపిస్తున్నారు) అని ఋగ్వేద ఘర్మసూక్తంలో ముప్పైఆఱు అవతారాలున్నట్లు పురాణ సిద్ధమైన సంఖ్యకూడా చూపబడింది. **"స్వర్ణఘర్మానువాకేన తథాపురుషవిద్యయా, పౌరుషేణ చ సూక్తేన"** (సువర్ణఘర్మసూక్తంతో, పురుషవిద్యతో, పురుషసూక్తంతో పరమపురుషుని ఆరాధించాలి) అని ఈ అనువాకంతో పురుషసూక్తంతో వలె పరమపురుషుని ఆరాధించాలి అని భాగవతంలో చెప్పబడింది.

**హంసహయగ్రీవావతారాలు :**

**"శతధాచరంతమ్", "బహుధావిజాయతే"** అని చెప్పబడిన మిగిలిన అవతారాలలోకొన్ని వేదాలలో అక్కడక్కడ సూచింపబడ్డాయి. **"శుచిం హంసమ్"** అని, **"ధ్రువం హంసమ్"** అని మాంత్రికోపనిషత్తులో, **"ఏకో సంహః భువనస్య మధ్యే"** అని ఆరంభించి, **"యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యోవైవేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను సృష్టికి పూర్వం సృష్టించాడో, ఎవడు అతనికి వేదాలను ఉపదేశించాడో) అని శ్వేతాశ్వతరోపనిషత్తులో హంసగా అవతరించి, వేదాలను అనుగ్రహించిన హంసావతారాన్ని గూర్చి పల్కింది. హయగ్రీవుడు కూడా హంసనామంతో



వ్యవహరింపబడుతున్నందున, ఇక్కడ హంసశబ్దం హయగ్రీవావతారాన్ని తెల్పుతుంది - అని పరకాల మఠయతీంద్రులు హయశిర ఉపాఖ్యాన వ్యాఖ్యానంలో ఉపపాదించారు. **"బ్రహ్మహశ్వేతాశ్వతరోథ విద్వాన్"** (శ్వేతాశ్వతరుడనే ఋషి పరబ్రహ్మను గూర్చి తెలిసికొన్నాడు) అని శ్వేతాశ్వతరోపనిషత్తు చివరలో ఈ ఉపనిషత్తును దర్శించిన ఋషి పేరు **"శ్వేతాశ్వతరు"**డని చెప్పబడింది. **"శ్వేతాశ్వేన తరతీతి శ్వేతాశ్వతరః"** (శ్వేతాశ్వం ద్వారా సంసారాన్ని దాటినవాడు కనుక శ్వేతాశ్వతరుడు) అనేది శ్వేతాశ్వతర శబ్దవ్యుత్పత్తి కనుక, ఈ ఉపనిషత్తును దర్శించిన ఋషి శ్వేతాశ్వతరుడని, అందువల్లనే హయగ్రీవవాచకమైన హంస శబ్దాన్ని బ్రహ్మకు వేదాలను ఉపదేశించిన చిహ్నాన్ని కూడా ఇతడు చూపాడని పరకాల మఠయతీశులు హయశిరోపాఖ్యానంలో (136 వపుట) నిరూపించారు. భగవానుడు హయగ్రీవుడై అవతరించినపుడు లక్ష్మి వాగ్దేవి అనే ఒక అవతారాన్ని ఎత్తింది. సర్వవిద్యలకు అధిదేవత వాగ్దేవితో కూడిన హయగ్రీవుడే వేదంలో పలుచోట **"వాక్"** అని, **"సరస్వతి"** అని పఠింపబడే దేవత ఈ వాగ్దేవియే. బ్రహ్మపత్ని అయిన సరస్వతి కూడా ఈమెకు చెందిన ఒక అంశమే. పూదత్తాళ్వార్లు తమ ప్రబంధం ఇరణ్డామ్ తిరువన్దాదిలోని **"నామ్ పెఱ్ఱనన్మైయుమ్ నామజ్ఞైనన్నెఞ్జత్తు ఓమ్బి యిరున్దమ్మై ఓదువిత్తు, వేమ్బిన్ పొరుళ్నీళ్మై యాయినుమ్ ఓదువిత్తు, వేమ్బిన్ పొరుళ్ నీళ్మై యాయినుమ్ పొన్నాఱ్పాడెన్డు అరుళ్నీరమై తన్ద అరుళ్"** (58) అనే పాశురంలో ప్రస్తావించిన వాగ్దేవి హయగ్రీవపత్నియే అని భావించడం యుక్తం. **"వాచస్పతిం విశ్వకర్మాణమ్"** (ఋక్-10-82-7) మొదలైన వేదమంత్రాలలో వాగ్దేవీపతిగా చెప్పబడేవాడే పరమపురుషుడైన హయగ్రీవుడు, **"వాజింతమాయ"** (ఋగ్వేదం- 10-115-6) అని ఋగ్వేదంలో గొప్ప

అశ్వరూపుడని పఠింపబడినవాడు ఈ హయగ్రీవుడే. హయగ్రీవరూపంతో యాజ్ఞవల్క్యునకు శతపథబ్రాహ్మణాన్ని ఉపదేశించిన ఆదిత్యుడు, ఆదిత్యమండలాంతర్వర్తి అయిన ఈ హయగ్రీవుడే. **"నమో వాచే నమోవాచస్పతయే నమోవిష్ణవే బృహతే కరోమి"** (వాగ్దేవికి నమస్కారం. వాగ్దేవికి పతి అయిన హయగ్రీవునకు నమస్కారం. ఆ స్వామికి మూలరూపుడైన విష్ణువునకు నమస్కరిస్తున్నాను) అని తైత్తిరీయారణ్యక స్వాధ్యాయ బ్రాహ్మణశాంతి పాఠంలో ప్రస్తావింపబడిన వాచస్పతి ఇతడే. **"అజస్యనాభావధ్యేక మర్పితం యస్మిన్నిదం భువన మధిశ్రితమ్, విశ్వస్య కర్మాహ్యజనిష్టదేవః ఆదిద్గంధర్వోభవద్వితీయః"** (తైత్తిరీయ-సంహి-4-6-2) (అనిరుద్ధ నారాయణుని తిరునాభిలో ఒకటి (ఒక తామరపూవు) వికసించింది. అందులో ఈ లోకం అంతా ఆశ్రయించి ఉన్నది. లోకాన్ని సృష్టించే బ్రహ్మ అందులో పుట్టాడు. అశ్వరూపుడైన హయగ్రీవ దేవుడు రెండవవాడుగా పుట్టాడు) అని అశ్వాన్ని తెలిపే గంధర్వశబ్దంతో తెలుపబడినవాడు హయగ్రీవుడే. వేదాలను కోల్పోయినపుడు బ్రహ్మ ఈ హయగ్రీవునే శరణుపొందాడనే దానిని **"అంతఃసముద్రే మనసా చరంతం బ్రహ్మాన్వవిందత్"** (సముద్రంలోపల మనస్సుతో సంచరించే ఇతనిని బ్రహ్మ చేరాడు) అని, **"అంతరాదిత్యే మనసా చరంతం దేవానాం హృదయం బ్రహ్మాన్వవిందత్"** (సూర్యుని నడుమ మనస్సుతో సంచరించేవాడు, దేవతలకు హృదయస్థానీయుడైన ఇతనిని బ్రహ్మచేరాడు) అని యజుర్వేద ఘర్మసూక్తం తెల్పుతున్నది. **"న హరిః"** (అతడు అశ్వరూపి) అని, **"హరిః పతంగః పటరీసుపర్ణః"** (అశ్వరూపాన్ని కలవాడు, నేలమీద కాలుమోపుతూ వెళ్ళేవాడు, కాంతిసమూహాన్ని కలవాడు, అందమైన గతిని కలవాడు) అని, **"ఏకో అశ్వః"** (సాటిలేని అశ్వం) అని ఘర్మసూత్రం చివర చెప్పబడినవి కూడా దీనిని



బలపరుస్తుంది. **"పతంగమక్తమసురస్యమాయయా, హృదాపశ్యంతి మనసామనీషిణః, సముద్రే అంతఃకవయో విచక్షతే, మరీచీనాం పరమిచ్ఛంతి వేధసః, పతంగోవాచం మనసా బిభర్తి, తాం గంధర్వో అవదత్ గర్భే అంతః"** (ఋగ్వేదం-10-177-1,2) (వేదాలను అపహరించిన అసురుల మాయవల్ల వ్యక్తమైనవాడు, భూమిపై కాలుమోపుతూ సంచరించేవాడు, అయిన హయగ్రీవుని జ్ఞానులు మంచిమనస్సుతో దర్శిస్తున్నారు. సముద్రం మధ్యలో జ్ఞానులు అతనిని దర్శిస్తున్నారు. నిత్యసూరుల దేశమైన విష్ణువుయొక్క పరమపదాన్ని వారు పొందగోరుతున్నారు. హయగ్రీవుడు వేదవాక్కులను మనస్సుతో ధరిస్తున్నాడు. దానిని అశ్వముఖుడై, తామరపూవులో ఉండే బ్రహ్మకు ఉపదేశించాడు) అని ఘర్మసూక్తం చివరలో వేదాపహారం, వేదోపదేశం వివరంగా తెలుపబడ్డాయి. **"హరిః పతంగః పటరీసుపర్ణః"** అని "సుపర్ణుడు" (అందమైన పతనాలను -కాలుమోపి నడిచే సంచారాలను కలవాడు) అనే పేర్లు హయగ్రీవునకు యజుర్వేద ఘర్మసూక్తంలో చెప్పబడ్డాయి. ఋగ్వేదం ఘర్మసూక్తంలో కూడా ఇదే పేరుతో అతనిని స్తుతించి, అతడు వాగ్దేవికి పతి అని ఈ క్రింది సూక్తంలో ఘోషించింది.

**ఏకః సుపర్ణః స సముద్రమావివేశ**
**స ఇదం విశ్వం భువనం విచష్టే ।**
**తం పాకేన మనసా పశ్యమంతితః**
**తం మాతారేళ్హి స ఉరేళ్హి మాతామ్ ॥**

**(10-114-4)** (అద్వితీయుడైన సుపర్ణుడు (హయగ్రీవుడు) సముద్రంలో ప్రవేశించాడు. అతడు ఈలోకాలను అన్నిటిని కటాక్షించాడు. అతనిని పక్వమైన మనస్సుతో సమీపంలో దర్శించాను.

అతనిని లోకానికి తల్లి అయిన వాగ్దేవి అనుభవిస్తున్నది) అని, **"సుపర్ణం విప్రాః కవయో వచోభిః ఏకం సంతం బహుధా కల్పయంతి"** (అద్వితీయుడైన సుపర్ణుని దూరదృష్టిని కల జ్ఞానులు తమ వాక్కులతో పలు రీతులుగా స్తుతిస్తున్నారు) అని తరువాత మంత్రంలో అధ్యయనం చేయబడుతున్నది. వాగ్దేవి అని, సరస్వతి అని చెప్పబడేది హయగ్రీవ పత్నియే-అని అనడానికి పలు ప్రమాణాలున్నాయి. విష్ణుస్మృతి ప్రారంభంలో **"ధ్రువం వాచస్పతిం ప్రభుమ్", "వాసుదేవం మహాత్మానమ్"** అని వాసుదేవుని సరస్వతీపతిగా చూపింది. ఆ స్మృతిలోనే లక్ష్మీదేవిని గూర్చి భూదేవి- **"త్వమేవ నిద్రాజగతః ప్రధానాలక్ష్మీర్ధృతిః శ్రీర్విరతిర్జయాచ, కాంతిః ప్రభాకీర్తిరథో విభూతి స్సరస్వతీ వాగథపావనీచ"** (నీవే నిద్రాదేవతవు, లోకానికి అంతటి ప్రధానురాలైన లక్ష్మివి, ధైర్యానికి అధిదేవతవునీవే, సంపదకు అధిదేవతవు, వైరాగ్యం, జయం, కాంతి, ప్రభ, కీర్తి, ఐశ్వర్యం అనే వీనికి అధిదేవతవు నీవే. "సరస్వతివి, పవిత్రంచేసే వాగ్దేవతవు నీవే) అని సరస్వతీదేవి కంటే వేఱయిన వాగ్దేవి ఒకతె ఉన్నదని పల్కింది. **"కీర్తిః శ్రీర్వాక్చనారీణామ్" (గీత-10-34)** (స్త్రీలలో సంపదకు దేవత అయిన లక్ష్మి, కీర్తికి అధిదేవత అయిన నీళాదేవి, విద్యకు అధిదేవత అయిన వాగ్దేవి నేనే) అని గీతలో భగవానుని పత్నులను పేర్కొనేటపుడు వాగ్దేవి పేరుకూడా చెప్పబడింది.

**"ఆవిర్బభూవ తత్పశ్చాన్ముఖతః పరమాత్మనః, ఏకాదేవీశుక్లవర్ణా వీణాపుస్తక ధారిణ కోటిపూర్ణేందు శోభాఢ్యా శరత్పంకజలోచనా, శ్రేష్ఠా శ్రుతీనాం శాస్త్రాణాం విదుషాం జననీపరా, వాగధిష్ఠాతృదేవిసా కవీనామిష్టదేవతా, శుద్ధసత్త్వ స్వరూపాసాశాంత రూపాసరస్వతీ"** (ఆ తరువాత పరమాత్మ ముఖం నుండి తెల్లని వర్ణాన్ని కల్గినది, వీణను, పుస్తకాన్ని ధరించినది, కోటిపూర్ణచంద్రుల కాంతితో వెలిగేది,



శరత్కాలంలోని తామరపూలవంటి నేత్రాలను కల్గినది వేదశాస్త్రాలకు అధిదేవత, విద్వాంసులకు జనని, వాక్కుకు అధిదేవత, కవులకు ఇష్టదేవ, శుద్ధసత్త్వస్వరూపిణి, శాంతరూపిణి అయిన సరస్వతి అనేదేవి ఒకతె పుట్టింది) అని బ్రహ్మవైవర్తపురాణంలో **(1-2-54,55,56) "సంకీర్ణేషు సరస్వత్యాః"** అని సత్త్వరజస్తమోగుణ ప్రధానుడైన బ్రహ్మపత్ని కంటే విలక్షణ అయిన శుద్ధసత్త్వస్వరూప అయిన సరస్వతియొక్క అవతారం తెలుపబడింది.

**"నారాయణ ప్రియా లక్ష్మీః సర్వసంపత్ స్వరూపిణీ, వాగధిష్ఠాతృదేవీ యా సాచపూజ్యాసరస్వతీ, శక్తిర్ద్వితీయా కథితా వేదోక్తా సర్వసంమతా" (1-30-20)** (అన్ని సంపదలైఉండే లక్ష్మి నారాయణునిపత్ని, వాక్కుకు అధిదేవత, పూజ్యురాలు, వేదంలో వాక్కు అని, సరస్వతి అని చెప్పబడేది, అందఱిచే కీర్తింపబడేది అయిన వాగ్దేవి నారాయణుని రెండవపత్ని) అని, **"వాఖ్యాముద్రాకరాశాంతా వీణాపుస్కృత ధారిణీ, శుద్ధసత్త్వస్వరూపాయా సుశీలాశ్రీహరిప్రియా"** (వ్యాఖ్యాన ముద్రను చూపే హస్తాన్ని కల్గినది, శాంతి స్వరూపిణి, వీణను, పుస్తకాలను ధరించినది, శుద్ధసత్త్వ స్వరూపిణి, చక్కని శీలాన్ని కల్గినది, శ్రీహరికి ప్రియమైనది) అనే ఈ పురాణంలో పలుచోట్ల విష్ణుపత్ని అయిన వాగ్దేవియొక్క స్వరూపస్వభావాలు వివరింపబడ్డాయి. **"మహావిద్యా మహావాణీం భారతీవాక్ సరస్వతీ" (4-67)** అని వాగ్దేవీ నామాలు, **"అక్షమాలాంకుశధరా వీణాపుస్తకధారిణీ" 94-5)** (అక్షమాలను, అంకుశాన్ని ధరించేది, వీణను, పుస్తకాన్ని ధరించేది) ఆమె రూపం లక్ష్మి తంత్రంలో చెప్పబడినవి. మాఘశుక్ల పంచమిలో ఈ వాగ్దేవిని పూజించాలి-అని బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పబడింది. **"నారాయణం నమస్కృత్య వరం చైవనరోత్తమమ్, దేవీం సరస్వతీం వ్యాసం**

**తతోజయముదీరయేత్"** (నారాయణుని, నరశ్రేష్ఠుడైన నరుని, సరస్వతీదేవిని, వ్యాసమహర్షిని నమస్కరించిన తరువాత భారతాన్ని పఠించాలి) అని మహాభారత ప్రారంభంలోని మంగళశ్లోకంలో నరనారాయణులతో చేర్చి పఠింపబడే సరస్వతి నారాయణపత్నియే-అనే విషయాన్ని ఈ క్రింది ప్రమాణాలవల్ల తెలియవచ్చు.

**"అతఃప్రాతః సముత్థాయచింతయే దాత్మనో హితమ్, నిర్గుణం నిరహంకారం నారాయణ మనామయమ్, సగుణం చ శ్రియాయుక్తం దేవం దేవీం సరస్వతీమ్"** (ఉదయమేనిద్రలేచి తన హితాన్ని గూర్చి ఆలోచించాలి ప్రాకృత గుణాలను లేనివాడు, కల్యాణగుణాలను కలవాడు, అహంకారం లేనివాడు, నాశం లేనివాడు, శ్రీదేవితో కూడిన వాడైన నారయణుని, సరస్వతీదేవిని చింతించాలి) అని ఆశ్వలాయన స్మృతిలో (71) ఈ అర్థం తెలుపబడింది. బోధాయన సూత్రకారులు ఈనాటివరకు విష్ణుపత్నికి తర్పణం చేసేటపుడు "సరస్వతీం దేవీం తర్పయామి" అని సరస్వతీదేవికి తర్పణం చేస్తున్నారు. ఆనందతీర్థులు కూడా పలుచోట్ల వాక్శబ్దాన్ని విష్ణుపత్నీపరంగా వ్యాఖ్యానించారు.

**"పద్మాంగసద్మాన మవేక్ష్యలక్ష్మీం ఏకస్య విష్ణోః శ్రయణాత్ సపత్నీమ్, ఆస్యేందుమస్యాభజతే జితాబ్జం సరస్వతీం తద్విజిగీషయాకిమ్"** (నైషధమ్-7-49) (ఒకడైన విష్ణువును (తనవలె ఆమెకూడా ఆశ్రయించినందున, తనకు సవితయై, తామరను నివాసస్థానంగా కల లక్ష్మిని చూచి, ఆమెకంటే గొప్పస్థానాన్ని పొంది, ఆమెను జయించడం కోసమే ఈ దమయంతి యొక్క, తామరను జయించిన ముఖచంద్రుని సరస్వతి నివాసస్థానంగా చేసికొన్నది) అని శ్రీగర్షుడునైషధంలో లక్ష్మీ-సరస్వతులు విష్ణుపత్నులు - అని స్పష్టంగా



చూపారు. **"సరస్వత్యాః విష్ణుపత్నీత్వం పురాణప్రసిద్ధమ్, తథా అర్చాస్వపి దృశ్యతే, యథాపురుషోత్తమస్య జగన్నాథస్య పార్శ్వే లక్ష్మీసరస్వత్యౌ"** (సరస్వతి విష్ణుపత్ని అనేది పురాణప్రసిద్ధం. అర్చారూపాలలో కూడా ఆ విధంగా కన్పిడుతున్నది. పురుషోత్తముడైన జగన్నాథుని పార్శ్వభాగాలలో లక్ష్మి, సరస్వతి వేంచేసి ఉన్నారుకదా!) అని ఇక్కడ మల్లినాథుడు వ్యాఖ్యానించాడు. **"వాచం నిజాంకరసికాం ప్రసమీక్షమాణః"** (గోపాలవిశంతి-2) (తన ఒడిలో ఉండే వాగ్దేవిని చూస్తూ ఉండేవాడు) అని వేదాంతదేశికులన్నారు. అందువల్ల **"అంబితమే నదీతమే దేవితమే సరస్వతి"** (ఋక్సంహిత-2-41-16) (గొప్పతల్లీ! గొప్పనదీ! గొప్పదేవీ! సరస్వతీ!) **"విశ్వాసరస్వతి త్రితాయుంషిదేవ్యామ్"** (ఋక్-2-41-17) (సరస్వతీ! నీవద్ద అన్ని వస్తువులు ఆశ్రయించి ఉన్నాయి), **"ఇమా బ్రహ్మ సరస్వతి"** (ఋక్-2-41-18), **"పావకానః సరస్వతి" (ఋక్-1-6-10), "చోదయత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం, యజ్ఞం దధేసరస్వతీ" (ఋక్-1-6-11)** (మంచి మాటలను ప్రేరేపించేది, జ్ఞానులకు జ్ఞానాన్ని కల్గించేది అయిన సరస్వతి యజ్ఞపురుషుని ధరిస్తున్నది) **"మహో అర్ణః సరస్వతీ"** (ఋక్-1-6-12) **"నమో వాచే"** (తైత్తి-ఆర-2-16-4-1), **"యావత్ బ్రహ్మ విష్టితం తావతీ వాక్"** (ఋక్-10-114-8) (బ్రహ్మం ఉండేచోట్ల అంతా వాగ్దేవి ఉన్నది) అని వేదంలో పలుపల చోట్ల అధ్యయనం చేయబడే గొప్పతనాన్ని కల్గినది హయగ్రీవపత్ని అయిన వాగ్దేవియే-అని నిశ్చయింపబడుతున్నది.

卐卐卐卐卐卐卐卐卐